# మనవి మాటలు

నేటికి మనం స్వతంత్రుల మైనాము. విశాలము - విఖ్యాతము అయినట్టిది మన స్వాతంత్ర్యోద్యమచరిత్ర. ఆ చరిత్రలో అసంఖ్యాక మైన త్యాగ, వీరఘట్టాలు నిండుకొని వున్నాయి. వాటిలో నా ఊహకందినవాటిని—కథలుగా చిత్రించ గలిగినవాటినీ స్వీకరించి ఆంధ్రులకందివ్వట మే నా తలంపు.

ఈ కథల్లో చారిత్రకఘటనల్ని చిత్రించేప్పుడు కళా దృష్టి లోపించి వుండవచ్చు. కళాదృష్టితో రచన సాగించినప్పుడు చరిత్ర-చిత్రణానికి అఘాతంకూడా కలిగి వుంటుందేమో! పెద్దలు మన్నించాలి.

కాంగ్రెసు ఉద్యమమే భారతదేశ స్వాతంత్ర్యోద్యమం కాబట్టి ఈకథలకు "కాంగ్రెసుకథలు" అని పేరు పెట్టాను. కొన్ని భాగాలుగా ఈకథలు ప్రచురింపబడుతాయి. ఆంధ్రలోకం నా కృషిని ఆదరిస్తుందని నమ్ముతున్నాను.

రచయిత.

ఇందలి కథలు

# కాంగ్రెసు కథలు



## 1. అమ్మ

బారిష్టరీవృత్తిలో బాగా పేరుపొందిన పటేలు మహాశయుడు రాజకీయాల్లో దిగినా, ఎక్కడ వుండినా నాటికీ నేటికీ సింహామే!

మహాత్ముని శంఖారావం విని దేశసేవకు కంకణం కట్టుకోకముందే అతడు గొప్ప స్థితప్రజ్ఞుడని ప్రతీతి.

ఉదాహారణంగా అతన్నిగురించి ఒక చిన్న కథ ఇలా చెప్తారు.

కోర్టులో పటేలు ఒక పెద్ద కేసులో ఒకనాడు వాదిస్తూన్నాడట—

ఇంతలో ఒక అర్జెంటు టెలిగ్రాం వచ్చింది. వెంటనే అందజేయాల్సింది కాబట్టి దాన్ని కోర్టులోనే అందజేశాడు పోస్టుజవాను. పటేలు వెంబడే ఆ టెలిగ్రామును చదివి జేబులో పెట్టుకొని, తన ఆర్గ్యుమెంటు పూర్తిగా ముగించి, ఆ తరువాత తక్కిన కేసుల్ని మరోనాటికి వాయిదా వేయవలసిందనీ, తాను తొందరగా వెళ్ళవలసివుందనీ కోర్టువారిని కోరాడట!

ఇంతవరకూ లేని తొందర ఇప్పుడే చూపించటంచేత ఆ జడ్జి కొంత ఆదుర్దాతో, ఆలోచన చేస్తానంటూనే, ఆ టెలిగ్రాం కథ ఏమని ప్రశ్నించాడు. "విశేష మేమీ లేదు. నా భార్య గతించిం"దని వెళ్ళిపోయాడు పటేల్. కోర్టులో అందరూ అతడు చూపిన ధృతికి విస్తుపోయా రంటే ఆశ్చర్య మేముంది?

అతని చిత్తస్థైర్య మంతటిది.

మొదటినుండీ పటేలుకు ఇంగ్లీషువారి పోకడలే. అహమ్మదాబాదు క్లబ్బులో స్పెన్సరుచుట్ట కాలుస్తూ, పేకాట ఆడుతూ ఎప్పుడైనా గాంధీ పే రెవరైనా ఎత్తితే "ఇతని విషయంలో ఏదో కొంత ప్రత్యేకత వుంది. కాని దేశాని కేమైనా ఉపయోగిస్తాడా అని నా సందేహం" అనేవాడు.

అతడు అప్పట్లో అహమ్మదాబాదు మునిసిపల్ ఛైర్మన్.

ఇంతటి నిరుత్సాహంగా వర్తించేవాడు గాంధీజీకి కుడి భుజంగా ఎలా మారిపోయాడో తర్కించలేము.

కాంగ్రెసు చరిత్రలో సుప్రసిద్ధమైన ఘట్టం బార్డోలీ సత్యాగ్రహం. అటువంటి మహోజ్వలఘట్టం మరెక్కడా తటస్థింపలేదు. ఆ ఉద్యమానికి నాయకుడు వల్లభాయి పటేలు.

మహాత్ముడు సహాయనిరాకరణ చేయుమని దేశాని కంతా ఆదేశ మిచ్చినా పన్నుల నిరాకరణకుమాత్రం అన్ని

చోట్లా అనుమతించలేదు — ఒక్క బార్డోలీ తాలూకాకు మాత్రమే ఆ గౌరవం దక్కింది. తన నాయకత్వంక్రింద ఆ ప్రజలను ఏకోన్ముఖంగా నడిపించగల గౌరవంకూడా పటేలుకే లభించింది.

దేశమంతా రాజకీయంగా ఒక గొప్ప తుపాను చెల రేగుతూన్న ఆ సమయంలో పన్నుల నిరాకరణప్రారంభోత్స వాన్ని జరుపుతూ పటేలు ఈ రీతిగా గర్జించాడు:

"విదేశీయ ప్రభుత్వము మన కెంతకాల ముంటుందో అంతకాలము మనకీ బానిసబ్రతుకే వుంటుంది. ఈ దేశంలో విదేశీయప్రభుత్వం పాదుకొనడానికి కారణం మన ప్రజలే! ప్రజాసహాయం లేకపోతే ఏ ప్రభుత్వమూ నిలువద్రొక్కుకో లేదు. మీరు పన్నులీయటానికి నిరాకరిస్తే మీ ఆస్తులు వేలం వేస్తారని భయపడవద్దు. ఆ వేలం వేస్తే కొనవలసిన వారుకూడా మీరే. మీ భూముల్ని ప్రభుత్వం నెత్తిన పెట్టుకొని పోలేదు. కడపటికి ప్రభుత్వం కాళ్ళబేరానికి రాకతప్పదు. ఇంతేకూ మీకు ముఖ్యంగా చెప్పవలసినది ఒకటి వున్నది. మనం భారతమాతపుత్రులం కాబట్టి మీరు తల్లిఋణం తీర్చాలి.

"భారతదేశంలోని తల్లులు వీరమాతలు. భారత పత్నులు వీరపత్నులు. వారి ఆశీర్వాదంతో, వారి సహా యంతో మనం మన దేశాన్ని స్వతంత్రం కావించుకొని తీరుతాం. మీరందరూ రేపటినుంచే ఈ ఉద్యమాన్ని సాగించి తీరాలి."

మామూలుగా అతని ఉపన్యాసంలో ప్రార్థనలుండవు. హేతువాదం అసలే వుండదు. అతని ఉపన్యాస మొక ఆజ్ఞాపత్రమే!

అతని అద్భుతప్రచారానికీ, అతని నిర్మాణశక్తికీ ఆశ్చర్యపడనివా రుండరు.

అహోరాత్రమూ బార్డోలీ తాలూకాలోని ప్రతి గ్రామమూ తిరిగి ప్రతివిషయంలోనూ కట్టుదిట్టాలు చేశారు.

పటేలుప్రయత్నానికి ప్రతిగా ప్రభుత్వ ప్రయత్నాలూ సాగుతూవున్నాయి. రెడ్డికరణాలను బెదిరించారు. లాభం లేకపోయింది. రైతుల నడుగమని జవాబిచ్చారు వారు. రైతులు పన్ను లివ్వడానికి వీలులేదని నిక్కచ్చిగా చెప్పేసరికి ప్రభుత్వంవారు ఆస్తుల్ని జప్తిచేస్తామన్నారు. బెదరలేదు. ఇంతకంటే చిత్రమైన రైతులు విషయ మేమంటే ఆ ఉద్యమంలో మగవాళ్ళు చూపిన నిగ్రహంకంటె ఆడవాళ్ళు చూపిన నిగ్రహం చాలా గొప్పది.

ప్రభుత్వం కడపటికి ఒక తీర్మానానికి వచ్చింది—"ఈ ఉద్యమానికి నాయకుడు పటేల్. అతన్ని అరెస్టు చేస్తే రైతుల్లో ఈ బిగి సడలిపోవచ్చు"నని. ఈ తీర్మానం చేసుకొన్న తర్వాత ఇక ప్రభుత్వం ఆలస్యంచేయవలసిన పనేమున్నది? వెంటనే సర్దారు పటేల్ అరెస్టు!

తిరిగి ప్రభుత్వపక్ష ప్రచారం. "మొదటనే మేము నాయకుల నందర్నీ జైల్లో వేశాం. ప్రభుత్వాన్ని ధిక్కరిస్తే ఎవరి కైనా ఇంతే." ఈ రకమైన ప్రచారం దిక్కు

లేకుండా సాగింది. కట్టకడపటికి ప్రజలందరూ తమతమ ఊళ్ళు ఖాళీచేయవలసి వచ్చింది.

ప్రజలు చలించలేదు. చిరునవ్వు నవ్వుతో వున్న ఇల్లాండ్రతో, తల్లులతో, పిల్లలతో వనవాసం చేయటానికే ప్రజలు నిశ్చయించుకొన్నారు. ఇంటిలో వున్న తమ సమస్తమూ రెండెడ్ల బండ్లమీద వేసుకొని అరణ్యానికి పోతూ వున్న ఆ దృశ్యం చూచినవా రెవరూ మరి మరువలేరు.

ఈ నిరంతర పోరాటంలో ప్రభుత్వంవారికి జయం సందేహాస్పదమైంది. వారి ప్రయత్నాల్లో అతిఘోరమైంది లాఠీఛార్జి. ఆ లాఠీఛార్జికికూడా ప్రజలు జంకలేదు.

కడపటికి ప్రజకు విసుగుపుట్టే మార్గమే తోచలేదు. ఈ ఉద్యమాన్ని నిర్వీర్యం చేసేటానికి ప్రభుత్వము ప్రత్యేకంగా పోలీసును నియమించింది. వాళ్ళకూ దిక్కుతోచలేదు.

ఇంత దిగ్భ్రమకూ కారణ మేమంటే, ఆడవాళ్ళు కూడా ఎంతో స్తిమితంగా వున్నారు. నాయకు లెంత బోధించినా ఆడవాళ్ళ కిన్నివిషయాలు హృదయస్థాలు కావు. ఒక్కొక్కప్పుడు వాళ్ళు పోలీసులతో హేతువాదాలకుకూడా తయారయ్యేవారు. మరి ఏ మహాశక్తి వాళ్ళకు వెన్నుముకగా నిలిచిందో? పటేలుకూతురు మణీబెన్ కొంత చదువుకొన్నదే. ఆమె ఏమైనా ప్రచారం సాగిస్తూన్న దేమోనని పోలీసులు ముందుగానే ఆమెను అరెస్టుచేశారు. కాని, వాళ్ళూ నిదానంగా ఆలోచించినారు. ఆడవాళ్ళకు

కూడా ప్రచారం చేసేవారు ఇంకా ఎవరైనా ఉన్నారా? ఎవర్నీ ఆచోకీ తీయలేక చాలాకాలం పోలీసులు బాధ పడ్డారు.

మరికొన్నాళ్ళు గతించాయి. ఎవరో ఒక ముసలామె ప్రతిదినమూ ఒక గ్రామానికి (అంటే ఆయా జనులు అప్పుడు నివసిస్తూండిన చోట్లకు) పోయి ఆడవాళ్ళకు ధైర్యం చెబుతూంటుందని ఆచోకీ తెలిసింది. పోలీసులు ఆమె ఎవరో చూడాలనీ, ఆమెకు తగిన బుద్ధి చెప్పాలనీ నిశ్చయించుకొన్నారు.

క్రమంగా ఆ ముసలామె వల్లభాయిపటేలు తల్లి అనీ, తొంభై ఏళ్ళ వృద్ధురాలనీ తెలిసింది.

పోలీసులు మగవాళ్ళను ఎన్నిబాధలు పెట్టినా ఆడవాళ్ళను బాధించేందుకు జంకినారు. పైగా ఆమె వల్లభాయి పటేల్‌గారి తల్లి - ఆమెకే అపకారం జరిగితే ప్రజలు తమను నిట్టనిలువునా చీల్చేస్తారనే భయంకూడా వాండ్లకుంది.

ఆమెప్రచారం ఏ మాత్రమూ ఆగలేదు. ప్రతిదినమూ వంటచేసుకొన్న తర్వాత అతిశ్రద్ధతో కర్ర పట్టుకొని ప్రయాణమై రాత్రికి ఏదో ఒక ఊరికి చేరుకొనేది. ఆ రాత్రి ఆ ఊరిలో ప్రతికుటుంబాన్నీ కలుసుకొని క్షేమసమాచారాలు తెలుసుకొనేది. తర్వాత వాళ్ళ మగవాళ్ళ నెవరినైనా పోలీసులు కొట్టివుంటే వాళ్ళను పరామర్శించి ఆ గాయాలకు మందులు వేయించేది - కట్టు కట్టించేది. వాళ్ళ

కెంతో ఉత్సాహం కలిగించేది. రాణా ప్రతాపుడూ, శివాజీ మొదలైనవాళ్ళ కథలు చెప్పేది. ఇది ఆమె దినచర్య.

ఇంత నిర్విరామ కృషితో ఆమె చేసే ప్రచారాన్ని చూచి పోలీసులు విస్మయపడ్డారు. ఆమెప్రచారాన్ని అడ్డగించాలని ప్రయత్నించేందుకు మొదలుపెట్టారు.

ఆమె మనుమరాలూ, కుమారుడూ జైలుకు పోయినప్పటినుండి ఆమె తీవ్రవాదిని అయిందనీ, వాళ్ళ చర్యల్ని సమర్థించేదానికి ఆమె ప్రచారం చేస్తున్నదనీ పోలీసులు ప్రజలకు అర్థమయ్యేట్లు చెప్పటానికి మొదలుపెట్టారు. కాని ఈ భేదోపాయం ఫలించలేదు. ఆ తర్వాత దండోపాయం మిగిలింది. ఎట్లా చేయాలని ఆలోచించారు. తుదకు ఆమె ఇంటికి వెళ్ళి సోదాచేయాలనీ, బెదిరించాలనీ నిశ్చయించుకొన్నారు. వెళ్ళి సోదాచేశారు. ఏమీ దొరకలేదు ఏవో కొన్ని ఆక్షేపణకరమైనట్టి కాగితాలున్నాయని పట్టుకపోయారు.

అంతటితో ఆగలేదు. మళ్ళీ సోదా! ఈసారి సోదా చేసేటప్పుడు కుండలన్నీ దించారు. ఏమేమో చూచారు. కడపటికి చిరాకుపడ్డారు. వంటయింటి పొయ్యివద్దకు దృష్టి పోయింది. అన్నంకుండ చూచారు. వారికి ఆ కోపంలో వెర్రెత్తిపోయింది. ఔచిత్యజ్ఞానం నశించింది. ఆ అన్నంలో ఇసుకా, కిరసనాయిలూ పోశారు.

ఆమె అది చూచింది. ఆ పోలీసులపెద్దతో ఇలా అన్నది :

"ఓయి నాయనా! నా అన్నంలో ఇసుకా, కిరస నాయిలూ కలిపితే నాకేమీ నష్టంలేదు. కాని, నిజంగా నీ అన్నంలో నీవే మన్ను కలుపుకున్నావోయ్!"

పోలీసు తిరిగి చూచాడు.

"వాగక. నోరు మూయ్."

"చాలా చూశా నీ బెదిరింపులు — ప్రయోజనం లేదు. ఒకటి విను. నేను చావుకు తెగించినదాన్ని. వృద్ధురాలను. నన్నేం చేస్తావు నీవు?"

"ఏం చేస్తానా?" అని ఒక పోలీసు గుడ్లురిమినాడు.

ఇంతలో మరొకాయన అందుకొన్నాడు:

"అమ్మా! ఇంత ప్రయత్నమూ చేసి మనం పొందే ఫలమేమో చెప్పు. ఇంత నష్టాన్ని, కష్టాన్ని ఎందుకు తెచ్చి పెట్టుకోవాలో చెప్పు?"

"ఓయి నాయనా! స్వాతంత్ర్య లాభం అనేది ఇన్ని కష్టాలకుకూడా మాకు తగిన బహుమానం తప్పక ఇస్తుంది. స్వతంత్రతాలాభానికంటె గొప్పలాభ ముందటయ్యా?"

"ఈ మాటలన్నీ నీ కొడుకు నేర్పినాడులే!" అని, "ఆమెతో వాదమెందుకు? రండి పోదాం" అన్నాడింకొకడు.

ఇంతలోకే ఆమె అందుకొన్నది: "మూర్ఖుడా! నా కుమారుడు నాకు నేర్పినాడంటున్నావు నీవు. అదే పొరపాటు. నా కొడుకు దేశభక్తుడవటాని క్కారణం ఎవరో నీకు తెలుసా?"

రెండో ఆయన అందుకొన్నాడు: "పటేలు మా ర్పుకూ కారణము నీవేనా అమ్మా?"

"ఎవ రనుకొన్నావయ్యా మరి? అతని మార్పుకు కారణం నేను. లోక మతణే మారినా డంటుంది. అతడు మారింది నావల్లనే. సీమకు పోయివచ్చింతర్వాత అతడు "భారతదేశంకూడా సీమవలెనే మారిపోవా" లనేవాడు. నేను "భారతదేశం పూర్వస్థితికే రావా" లని వాదించే దాన్ని. తర్వాత గాంధీకూడా నా వాదాన్నే బలపరిచాడు. అప్పుడు తన ఓటమి ఒప్పుకొన్నాడు. అదీ నిజం."

"అమ్మా, నీవు ఆదిశక్తివి" అన్నా రందరూ!

ఆమె చిన్నగా నవ్వింది. అంతే...ఆమెపే రేమో చరిత్ర కెక్కలేదు. మాకూ తెలీదు. పటేలు మాత్రము ఆమెను 'అమ్మా' అని ఆప్యాయంగా పిలిచేవాడు.

మనమూ ఆమెను 'అమ్మా' అనే పిలుద్దాం.



# 2. దేశంకోసం

"ఈ రోజుతో నా సర్వస్వం, బ్రిటిషువారి పుణ్యమా అని, కోల్పోయాను. ఇంక ఈ విశాల భారతదేశంలో నీకు నేనూ, నాకు నీవే దిక్కు. మన దేశసేవ కడకు మనల్ని ఇద్దర్నీ పరస్పరసహాయులనుగా చేయగలిగింది. ఓ దేశమా! నీకు మా ధన్యవాదాలు. హైమా! ఈనాడు పొయ్యి మీాది కెక్కే అవకాశ మేమైనా వుందా, లేక పస్తుపడి చావవలసిందేనా?"

హైమవతికి గుండె చెదిరిపోయింది. ఎంతటి కష్టాల్లోనూ రామారావిట్లా మాట్లాడి ఎరుగడు. సాహసాని కతడి కతడే సాటి. అలాంటి ధైర్యవంతుడు నేడిలా నీరసంగా మాట్లాడుతూ దైన్యాన్ని కండ్లల్లో ప్రతిబింబింపజేస్తూండటంచేత ఆమె చాలా భయపడ్డది. ఆ భయంలోనూ జరిగిన వృత్తాంత మేమిటో అనే ఆదుర్దాతో కాస్త నిదానించి "ఏమండీ! మీారిలా ఎన్నడూ నైరాశ్యంతో మాట్లాట్టం నే నెరుగను. దీని కంతా గల కారణమేదో చెప్పి నా మనస్సుకు కుదురుబాటు కలిగించం"డని ప్రార్థించింది. "ఇంక, హైమా, మనిద్దరికీ ఎప్పటికైనా కుదురుబాటే. ఈ ప్రపంచంలో మనిద్దరికీ సంబంధించిన ఇంకో వస్తువంటూ లేదు. ఆ వున్న ఇల్లు కాస్తా మన రావుబహాదూరుగారి సహాయంతో బ్రిటిషుప్రభుత్వం కాజేసింది. ఇంక మనం తలదాచుకోనేందుకైనా స్థలం లేదు. ఈ

దుర్భర విషాదపూరిత జీవితనౌకల్ని ఈ మహాదారిద్ర్య సాగరంనుండి ఎలా తరింపజేసుకోగలనో నే నూహించలేకుండా వున్నాను.'' అని ఒక నిట్టూర్పు విడిచి రామారావు బరువెక్కిన హృదయంతో గోడకు వ్రాలి పరధ్యానంగా కన్నులు మూసుకున్నాడు.

హైమహృదయం తటతట లాడింది. రామారావు వింతప్రవర్తన ఆమెశరీరాన్ని కదల్చివేసింది. అతని దగ్గరకు చేరి, జడలుగా వ్రేలాడుతూన్న జుత్తును సవరిస్తూ, రామారావుముఖంలో ముఖం పెట్టి ''నేను మీ ఎదుట వుండగానే మీ రంతటి బాధ అనుభవించటం దేనికి? దేశంకోసం నీ వాక్కుదానివి నాకు తోడునీడగా వుంటే నే నెంతటి త్యాగానికైనా సిద్ధపడుతా నన్న వాగ్దానాన్ని మరిచారా? మీ రేమీ చింతపడనక్కరలేదు - చింతపడరు కూడా. నాకోసం మీ రిలా బాధపడుతున్నా రనుకుంటా. మన కీ ఇల్లు వుంటే ఎంత లాభమో, పోతేనూ అంతే. మీఆస్తినంతా దేశాని కిచ్చారు.నాఆస్తిని కాలదన్ని మీతో వచ్చాను. మీ రీ వెధవ ఇంటికోసం బెంగపెట్టుకోవటం తగదు. గాంధీ మహాత్ముని అంతటివాడే వెదురుగుడిసెల్లో కాపురం చేస్తుంటే మనంమాత్రం చేయలేమా? అసలు జరిగినసంగ తేమిటో చెప్పండి.'' అని అతని భుజాలు నిమురుతూ, అచేతనంగా వున్న రామారావుకు హైమవతి చైతన్యం కలిగించింది. అతడు హైమకళ్ళల్లోకి దైన్యంగా చూచాడు. ఆమె అతని ముఖంపై వ్రాలిన వెంట్రుకల్ని

సర్దుతూ "అసలు జరిగిన సంగతేమిటో చెప్పు" మన్నట్లుగా చూచింది.

"ఎందుకు నన్నిలా ప్రాణం తీస్తావు? నీ వెంత ధైర్యం చెప్పినా చెదిరిన గుండెకు శాంతి దొరుకుతుందా? నిజంగా ఈ కేసులో నాకేమీ సంబంధం లేదు. మన రావుబహదూరు ఈ కాంగ్రెసువాళ్ళు జైళ్ళకు పోయిన అవకాశాన్ని చూసుకొని జిల్లాబోర్డు ప్రెసిడెంటు కావాలని ప్రయత్నిస్తున్నాడు. అలాంటి స్థితిలో ఒక కాంగ్రెసువాది జైలుకు పోకుండా తన వూళ్ళో వుండటం అతనికి మహావిసుగు. నేడు ఇండియా దేశ రక్షణచట్టం అనే పేరుతో బ్రిటిషు వారు భారతదేశంలో పోలీసురాజ్యాన్ని నెలకొల్పారు. ఏ మనిషిలోనూ దేశభక్తిని మిగల్చకుండా చేయాలని ప్రభుత్వ ప్రయత్నం. మన రావుబహదూరు ఈ పల్లెటూళ్లో వుండే రైతుల్ని పీల్చి పిప్పిచేసి గవర్నరుగారి యుద్ధనిధికి ధనరాసుల్ని సమకూరుద్దామని ప్రయత్నించాడు. అలాంటప్పుడు మన మీ వూళ్ళో వుండటం అతనికో పెద్ద ఆటంకమైంది. సబ్ ఇన్స్పెక్టర్ని పట్టుకవచ్చి, యుద్ధనిధికి నే నడ్డుపడ్డాననే అపనింద పెట్టించి నాపై కేసు బనాయింపజేసినాడు. ఆ తెలివితక్కువ మేజిస్ట్రేటుకూడా నన్ను దోషిగానే భావించి వేయిరూపాయీలు జరిమానా చెల్లించమంటే, చేతకాదన్నాను. రావుబహదూరుగారు నా కోఇల్లు వుందనీ, ఆ ఇంటిని తనపరం చేస్తే జరిమానా చెల్లిస్తాననీ అన్నాడు. ఎలాగైనా డబ్బును రాబట్టుకోవటమే ముఖ్య కార్యక్రమంగా పెట్టుకొన్న బ్రిటిషువారి గులాములు అందు కంగీక

రించారు. నే నెంత వాదించినా బూడిదలోపోసిన పన్నీ రవటమే అయింది. నేటితో మన ఇంటికి యజమాని రావు బహదూరు. ఆ కాలాంతకునికి నీతినియమాలు లేవు. సరి ప్రొద్దు రాత్రప్పుడైనా వచ్చి ఇల్లు ఖాళీచేయ మనవచ్చు. హైవూ! మూడురోజుల్లో ఇంతటి కథాక్రమం నడిపించిన ఆ రావుబహదూరు చాకచక్యము వేనోళ్ళ పొగడవలసిందే. హఠాత్తుగా మనకు వచ్చిన ఈ కష్టానికి ఆదుకొనేవా రెవరూ లేరు. అనుభవించాల్సిందే. ఏం చెబుతావ్ ?''

''ఉస్...నీని కేనా ఇంతటి ఆరాటం! మీ జీవి తంలో బంగారంపండే పొలాలు, ఆకాశా న్నంటుకునే మేడలూ-ఎంతో ఐశ్వర్యాన్ని దేశంకోసం త్యాగంచేశారు. ఇంతమాత్రానికి బెంగ పనికిరాదు. ఇందుకు కన్నీళ్ళు కార్చటమా? ఏ రోజుకైనా శుభాన్ని ఎదురు చూస్తుందాం. నిరాశ మానవుని ఉన్నతికి గొడ్డలిపెట్టు - ఆదర్శాల్ని చంపి వేస్తుంది. అలాంటి నిరాశకు మీ రెన్నడూ తావియ్య కూడదు. రంగని గుడిసెప్రక్కన తాటాకులతో మరుగు వేసుకొని జీవిద్దాం. చూచారా? ఈరోజు రంగడే బియ్యం తెచ్చిపెట్టాడు. వంట చేశాను. భోజనం చేదురుగాని లెండి.'' అని అతనిని బలవంతంగా స్నానం చేయించి, భోజనం చేయించగలిగింది.

*    *    *    *    *

రామారావు మంచి సంపన్నమైన కుటుంబంలో జన్మించాడు. అతనికి నలుగురు సోదరులు, ఇద్దరుసోదరీమణులు

ఉన్నారు. తండ్రి మద్రాసులో పేరుమ్రోగిన లాయరు. రామారావు మద్రాసు ప్రెసిడెన్సీకళాశాలలో బి. ఏ. జూనియర్ తరగతి చదివేటప్పుడు గాంధీమహాత్ముని సహాయ నిరాకరణం పిలుపు అతని చెవుల్లో గింగురుమని మ్రోగింది. ప్రభుత్వకళాశాలల బహిష్కరణోద్యమం యువకుల్లో తీవ్రంగా సాగింది. మన రామారావుకూడా చదువు మాని దేశం కోసం సంసిద్ధు డయ్యాడు. కాంగ్రెసులో చేరటంచేత అతని హూటు, బూటు ఒక్క దెబ్బలో మాయమయ్యాయి. నేడతడు ఒక లాల్చీ, ఒక అడ్డపంచెతో తయారయి కాంగ్రెసు ప్రబోధం చేయడానికి మద్రాసు సందుగొందులన్నీ తిరుగుతున్నాడు.

1933 సం. వరకు కాంగ్రెసు సంస్థ స్త్రీలను అంతగా ఆకర్షించలేక పోయింది. అనిబిసెంటమ్మ, సరోజినీదేవి మొదలైనవారి ప్రబోధం భారతస్త్రీలలో క్రమక్రమంగా జాతీయతను రేకెత్తిస్తూవచ్చింది. కాంగ్రెసు సమావేశాల్లో ప్రతిచోటా స్వయంసేవక దళాలతోపాటు స్వయంసేవికా దళాలు కూడా ఏర్పడుతూ వచ్చాయి. అందుచేత మద్రాసులోనూ ఉద్యమనిర్వహణంకోసం ఒక సేవికాదళం ఏర్పరుపబడింది. హైమవతి ప్రభుత్వకళాశాలలో ఇంటర్ జూనియర్ చదువుతూ మానేసి ఈ స్వయంసేవికాదళంలో చేరింది. ఆనాడు మద్రాసుపట్టణంలో ఎక్కడ ఏ మీటింగు జరిగినప్పటికీ స్వయంసేవక-సేవికాదళాలు క్రమశిక్షణతో పని చేయసాగాయి.

హైమ ఒక క్రిస్టియన్ ఉద్యోగి కూతురు. ఆమె పూర్తిపేరు హైమావతీ ఎడ్వర్డ్స్. క్రిస్టియన్లు చాలాభాగం భారతజాతీయోద్యమానికి వ్యతిరేకులు. కాని, క్రిస్టియన్లు కాంగ్రెసులో లేరా అంటే చాలా తక్కువసంఖ్యలో వుంటూ వచ్చారు. వారి మతము విదేశీ మతము. వారికి మతాన్ని బోధించేది కూడా విదేశీయులే! వారు నాగరికతగా భావించేది విదేశ నాగరికతనే! అలాంటప్పుడు వారిలో జాతీయతకు తా వుండేది కాదు. ఏవి ఎన్నివున్నా వారిలో ఒక్క సుగుణం మాత్రం వుందనాలి. అదే స్త్రీపురుష సమానత్వం. అమెరికాస్త్రీలను గురించి ముచ్చటిస్తూ స్వామి వివేకానంద "స్త్రీలకు అమెరికాదేశంలో పురుషులతో పాటే సమానహక్కు లున్నాయి. స్త్రీజాతిని గౌరవిస్తూన్నది కాబట్టే అమెరికాదేశం అష్టైశ్వర్యాలతో తులతూగుచున్నది. నిజంగా ఈ విషయంలో మన భారతదేశం అమెరికాను చూచి సిగ్గుపడక తప్ప"దని తెలిపాడు. మన హైమ క్రిస్టియన్ స్త్రీ కాబట్టి ఆ వున్న స్వయంసేవికల్లో కాస్త చురుగ్గానూ, మగవాళ్ళతో కలిసిమెలసిన్నీ తిరుగుతూ వచ్చింది.

గుండ్రని ముఖం, ఉంగరాలు తిరిగిన ఆ వెంట్రుకలూ, నిమ్మపండువంటి ఆ శరీరచ్ఛాయా, ఎఱ్ఱటి పెదవులూ, మధురముగ్ధమైన ఆ కన్నులూ చూచి ఎంతో ఆనందించేవాడు రామారావు. తనకంటే రెండింతలు అందంగా వున్న రామారావును చూచి హైమ నిత్యమూ ముగ్ధురాలయ్యేది.

ఒకే ఉద్యమంలో, ఒకే ఉద్దేశంతో ఇద్దరూ కలిసిమెలసి పనిచేయవలసిరావటంచేత దినదినానికీ ఆ లేతహృదయాలకు స్నేహం ఎక్కువైంది. హైమ క్రిస్టియన్ స్త్రీ అని రామారావుకు తెలియదు. అతడు బ్రాహ్మణు డనే విషయం హైమ ఎఱుగదు. ఆరోజుల్లో కులగోత్రా లడుక్కోవటం అనాగరికత. పైగా అన్ని కులగోత్రాలనూ ఐక్యం చేసుకొనే కాంగ్రెసులో ఈ దురలవాటు ప్రవేశించే అవకాశమే లేదు.

1933 సం. లో లక్షా ఇరవై వేలమంది జైళ్ళకు వెళ్ళారు. మన హైమా, రామారావులు కూడా జైలుయాత్ర చేయవలసి వచ్చింది. ఆ తర్వాత గాంధీ–ఇర్విన్ ఒడంబడిక ననుసరించి అందరినీ వదిలిపెట్టారు. మన రామారావు, హైమలు మళ్ళామద్రాసులో కలుసుకొన్నారు. ఈపర్యాయం ఒకరి హృదయంపై ఒకరి హృదయం ఒత్తిడిచేయటం ప్రారంభమైంది. పైగా హైమ జాతీయోద్యమంలో చేరటం, జైలుకు పోవటం మొదలైన విషయాలు తండ్రి తెలుసుకొని ఆమెకు డబ్బు పంపటంకాని, తాకి తలచుకోవటం కాని మానివేశాడు. అందువల్ల ఆమె ఉదారులైన స్థానిక కాంగ్రెసుపెద్దలపైనే ఆధారపడవలసి వచ్చింది. మన రామారావు కూడా ఆమెకు చేతనైన సహాయం చేస్తూ వచ్చాడు. వారిద్దరూ కలిసి చరఖామీద నూలుతీయటం, హిందీ నేర్చుకోవటం ఇదీ వారి దినకృత్యం. ఇలా ఆరు నెలలు గడిపారు.

రామారావుఇంట్లో తుపాను చెలరేగింది. అతని అన్నదమ్ముల కతను చేసే చర్య లేమీ గిట్టటం లేదు. వాళ్ళు బూర్జువాతత్వం గలవారు. రామారావును అతని మార్గంనుండి తప్పించేందుకు వారు పలుమార్లు ప్రయత్నించారు. సాధ్యం కాలేదు. తుద కతనితో సంబంధం తెంచుకోవాలనుకున్నారు. భాగపరిష్కారాలు చేశారు. కర్నూలు సమీపంలో ఒక పల్లెటూళ్ళో వుండే వాళ్ళ తాతగారి ఇల్లు రామారావు తన భాగానికని తీసుకొన్నాడు. దాదాపు ఇరవై వేలరూపాయిల నగదూ, కొంత బంగారమూ రామారావుచేతి కిచ్చారు. చెల్లెండ్లకు ఆ బంగారాన్ని పంచిపెట్టి నగదుమాత్రం తీసుకొని ఆ అన్నదమ్ములతో సంబంధం వదులుకున్నాడు రామారావు.

భాగపరిష్కారాలు ముగియగానే, ఇకమీద హైమతో స్వేచ్ఛాసంబంధం పెట్టుకోవచ్చునని రామారావు నిశ్చయం. ఖర్చులకుమాత్రం కొంత పైకం వుంచుకొని, మిగతా పైకాన్ని బ్యాంకులో వేశాడు. హైమను కాంగ్రెసు ఆఫీసులో కలుసుకొని, జరిగిన సంగతి అంతా చెప్పి, ఇద్దరం శాంతినికేతనం వెళ్ళి గురుదేవుని దర్శింతా మన్నాడు. హైమ తల వూపింది. ఇద్దరూ కలకత్తా మెయిల్లో కూర్చొని శాంతినికేతనానికి బయలుదేరారు. రైలు విశాఖపట్టణం చేరగానే రామారావు వార్తాపత్రిక కొన్నాడు. ఆనాడు 17-1-1934 తేదీ. పత్రికలో వుండే పెద్దపెద్ద అక్షరాలు చూడగానే అతని గుండె చెరువైపోయింది.

కండ్ల నీరు కారుస్తూ వచ్చి తన సీటులో కూర్చొన్నాడు. హైమకు ఇతని ప్రవర్తన మెంతో విషాదం కలిగించింది.

"బీహారులో భూకంపం - అపారమైన నష్టాలు." అనే పెద్దపెద్ద అక్షరాలతో వుండే శీర్షికను రామారావు గాద్గదికస్వరంతో చదివాడు. ఇక దాని క్రింద "30 వేల చదరపుమైళ్ళలో భూకంపం కలిగింది. 20 వేలమంది చనిపోయారు. దాదాపు కోటిన్నరజనం బాధపడ్డారు. పదిలక్షల ఇండ్లు కూలిపోయాయి. 15 బావులు, చెరువులు బూడిపోయా"యని చదువుతూ ఆపైన "15 వందల అడుగుల లోతు భూమిలోనుండి 110 డిగ్రీల ఉష్ణంతో నీళ్ళు పైకెగజిమ్మినా"యని చదివి కండ్లనిండా నీళ్ళు పెట్టాడు. హైమకు కూడా నోటినుండి మాట పెకలిరాలేదు. బీహారుకు సానుభూతిని ప్రదర్శించేందుకో అన్నట్లు వాళ్ళిద్దరూ కాస్తసేపు మాట్లాడకుండా వుండినారు.

"హైమా! నా కడుపు తరుక్కుపోతోంది. ఈ వార్తల్నిబట్టి చూస్తే బీహారులో ప్రకృతే మారిపోయివుండవచ్చు. మేడలన్నీ భూమిలోనికి చొచ్చుకొనిపోయి వుంటాయి. తల్లుల్ని బాసిన పిల్లలూ, మగండ్లను పోగొట్టుకున్న ఇల్లాండ్లూ- దేశం అంతా అయోమయంగా వుంటుంది. బంగారంలాంటి బీహారు నేడు శ్మశానఘట్టమే! వెంటనే మనమక్కడికి వెళ్ళుదాం. త్వరలోనే కాంగ్రెసు పిలుపుకూడా రావచ్చు" అని చెప్పి కిటికీవైపు తలవాల్చి భారంగా ఊపిరి పీలుస్తున్నాడు. హైమ అతని కన్నీళ్ళు కర్చీఫ్‌తో

తుడిచింది. వారిద్దరి పరస్పరానురాగం దేశభక్తిలో లీనమై పోయింది.

కలకత్తా హౌరా స్టేషన్‌లో రైలు దిగారు. దిగీదిగ టంతోనే వార్తాపత్రికకోసం రామారావు వెదక్కుంటూ ప్లాటుఫారం దాటివెళ్ళాడు. హైమ సామాన్లు దింపుకొని అతని రాకకు ఎదురుచూస్తూ నిలుచుంది. రామారావు 'అమృత బజార్' చేతబట్టుకొని వచ్చాడు. అందులో కాంగ్రెసు నాయకముఖ్యులంతా బీహారుకు తమతమ సాను భూతిని తెలియజేశారు. 'బీహారుబాధిత సహాయసంఘం' రాజేంద్రప్రసాదుగారి అధ్యక్షతన ఏర్పరుపనున్నట్లు సూచ నలు చేయబడినాయి. ఆ ప్రకటన చదువగానే రామారావు సరసర హైమదగ్గరకు వచ్చి పెట్టె తెరువమన్నాడు. వెంటనే చెక్కుపుస్తకము తీసుకొని బ్యాంకులో నిలవఉన్న మొత్తము 18 వేల రూపాయిలకు బాబూ రాజేంద్ర ప్రసాదుగారి పేర చెక్కు వ్రాసి, దానితోపాటు తానూ, తనస్నేహితురాలైన హైమవతీ వాలంటీరు దళంలో చేరేం దుకు త్వరలో వస్తున్నామని ఒక జాబుకూడా వ్రాసి పంపించాడు.

కలకత్తా కాంగ్రెసు ఆఫీసులో వారు బసచేసినారు. ఆఫీ సులో వుంటూన్న బెంగాలీ యువకులు వారిని సాదరంగా విచారించి, ఒక బహిరంగ సభలో ఉపన్యసించ వలసినదిగా రామారావును కోరారు. రామారా వందుకు ఇష్టపడ లేదు. తుదకు హైమ పట్టుపట్టడంచేత సరే నన్నాడు. బ్రహ్మాండ

మైన బహిరంగసభ ఏర్పాటుచేయ బడింది. ఆసభకు శ్యామ ప్రసాద ముఖర్జీ అధ్యక్షత వహించాడు. ఆయన తన అధ్యక్షోపన్యాసంలో బీహారు భూకంపం విషయమై ప్రస్తావించటం వల్ల రామారావు దాన్ని అందుకొని బీహారు భూకంపాన్ని వివరంగా వర్ణించి చెప్పి "మీరంతా అందుకు సహాయం చేయా" లని కోరాడు. హైమ కూడా ఆంగ్లంలో ఉపన్యసిస్తూ, రామారావు బీహారుభూకంపానికి సహాయార్థంగా తనవద్దనున్న 18 వేలూ దానంచేశాడని చెప్పేసరికి సభంతా ఆశ్చర్యం పొందింది. ఆ అవకాశాన్ని పురస్కరించుకొని రామారావు "మీరూ మీకు తోచిన సహాయం చేయాల్సిం"దనీ, తాను త్వరలోనే బీహారుకు వాలంటీరుదళంలో పనిచేసేందుకు పోతున్నాననీ చెప్పేసరికి కనకవర్షం కురిసింది. ఆ చిల్లర మొత్తం దాదాపు 10 వేలు. రామారావు వెంట బీహారుకు వచ్చేందుకు 20 మంది బెంగాలీ యువకులు తయారయ్యారు. రామారావు వారితో కలిసి సహాయనిధి వసూలుచేస్తూ బీహారుకు బయలుదేరి వెళ్ళాడు.

పండిత నెహ్రూ అదేరోజున బీహారు చేరుకున్నాడు. రాజేంద్రప్రసాదుకు రామారావు పంపిన చెక్కూ, ఉత్తరమూ చేరటంచేత ఆయన అతని రాకకు ఎదురుచూస్తూవుంటి నాడు. ఇంతలోనే రామారావు హైమతోనూ, బెంగాలీ యువకులతోనూ వచ్చి రాజేంద్రప్రసాదుదర్శనం చేసుకున్నాడు. తాను కలకత్తాపరిసరాల్లో వసూలుచేసిన మొత్తంకూడా రాజబాబు కందజేసేసరికి ఆయన కెంతో సంతోషమై రామారావును కౌగిలించు కొన్నాడు. తర్వాత

రాజన్ బాబు వీళ్ళందర్నీ నెహ్రూబనకు తీసుకవెళ్ళి, రామా రావును ఆయనకు పరిచయంచేస్తూ, అతని దాతృత్వాన్ని శ్లాఘించాడు. నెహ్రూ పులకితగాత్రుడై రామారావును కౌగిలించుకొని దేశాని కిలాంటి యువకులు కావాలన్నారు.

గాంధీగారున్నూ ఒక నెల పర్యటించారు. ఆయన హైమా, రామారావులు చేస్తూన్న సేవను గుర్తించి "మీ రిద్దరూ పెండ్లి చేసుకోవా"లని ఆజ్ఞాపించగా రామారావు కిక్కురు మనలేదు. వెంటనే తానే పెండ్లి జరిపించాడు. హరిజ నోద్యమానికిగాను తీవ్రప్రచారం ఇంకా అప్పుడప్పుడే జరు గుతూ వుండడంచేత బ్రాహ్మణయువకుడు హరిజనబాలికను పెండ్లిచేసుకొన్నాడని పెద్దపెద్ద శీర్షికల్తో ఆ వార్తను పత్రి కలు ప్రకటించాయి. మద్రాసులోని కాంగ్రెసువాదులంతా సంతోషపడి తమతమ శుభసందేశాలు తెలియచేశారు.

రామారావు భార్యతోసహా ఒక సంవత్సరం బీహా రులోనే వుండి తర్వాత వార్ధా చేరుకొన్నాడు. అక్కడ ప్రశాంతంగా కాలం గడుపుతూ, రాజకీయా లెప్పటికప్పుడు క్షుణ్ణంగా అవగాహన చేసుకుంటూ వచ్చాడు.

ఇలా వుండగా 1935–వ సం. భారతదేశ రాజ్యాంగ చట్టాన్ని ఒకదానిని బ్రిటిషువారు మనకు ప్రసాదించారు. దానితోనే సాధ్యమైనంతా అధికారాన్ని సంపాదిస్తామని చెప్పి, ఆ చట్టాని కిష్టపడుతూ, జరుగబోయే ఎన్నికల్లో పాల్గొనేందుకు కాంగ్రెసు నిశ్చయించింది.

అప్పుడు గాంధీమహాత్ముడు ఎన్నికల ప్రచారంకోసం మద్రాసుకు వెళ్ళమని రామారావు కాజ్ఞాపించాడు. హైమతో రామారావు మద్రాసుకు వెళ్ళేందుకు సిద్ధపడ్డా డనే విషయం బజాజ్ తెలుసుకొని రెండువేలరూపాయీ లతనికిచ్చి, ఇంకా అవసరమైనప్పుడల్లా పంపుతుంటాను, ఉత్తరాలు వ్రాస్తూవుండమని చెప్పాడు. ఆ భార్యాభర్తలు బజాజ్ కు తమ కృతజ్ఞతను తెలిపి, మహాత్ముని ఆశీస్సులను పొంది మద్రాసుకు ప్రయాణమయ్యారు.

* * * *

మద్రాసు చేరుకొని వారు స్థానిక కాంగ్రెసువాదులతో అభినందింపబడ్డారు. అడయారులో నివాస మేర్పరచుకొని కాంగ్రెసు ఉద్యమానికి కృషిచేయ సాగాడు రామారావు. ఇంతలోకే ఎలెక్షన్ల హడావిడి వచ్చింది. రామారావును అసెంబ్లీకి అభ్యర్థిగా నిలువమని తమిళ - ఆంధ్ర కాంగ్రెసు సంఘాలవా రుభయులూ కోరారు. అతను ఒప్పుకోలేదు. ప్రచారానికని బొబ్బిలి, నెల్లూరు మొదలైన స్థలాలకు వెళ్ళి కాంగ్రెసు అభ్యర్థులన్నే గెలిపించమని ప్రజలకు విజ్ఞప్తిచేస్తూ ఎన్నో సమావేశాల్లో ఉపన్యసించాడు. హైమ తమిళ నాడులోకి వెళ్ళి ప్రచారం చేసింది. ఇంతకూ మద్రాసు శాసనసభలో కాంగ్రెసుపక్షం గొప్ప మెజారిటీ సంపాదిం చింది. శ్రీ చక్రవర్తుల రాజగోపాలాచారిగారి ప్రధాన

మంత్రిత్వంతో మంత్రివర్గం ఏర్పరుపబడింది. ప్రధాని చక్కగా పరిపాలనావ్యవహారాలు సాగిస్తున్నాడని ప్రజలంతా అనుకోసాగారు.

*      *      *      *

కాలచక్రం గిర్రున తిరిగింది. రెండవ ప్రపంచయుద్ధం దాపురమైంది. యుద్ధంకోసం బ్రిటిషువాళ్ళు కొన్ని ప్రత్యేక-ప్రజాకంటకశాసనాల్ని అమలుపరిచేందుకు ప్రారంభించారు. కాంగ్రెసుకు అసహ్యమనిపించి, రాష్ట్రాల్లో వుండే కాంగ్రెసు ప్రభుత్వాలు వెంటనే రాజీనామా ఇవ్వవలసిందిగా అఖిల భారత కాంగ్రెసు సంఘం ఆదేశించింది. మొట్టమొదటే మద్రాసు మంత్రివర్గం రాజీనామా. 93 సెక్షన్ నిరంకుశ పరిపాలనము ప్రారంభమైంది. గాంధీజీ యుద్ధవ్యతిరేకంగా వ్యష్టిసత్యాగ్రహానికి దేశాన్ని సిద్ధపరిచాడు. ఒకరి వెంట ఒకరు ఆ సత్యాగ్రహ సమరంలో చిక్కిపోవాల్సి వచ్చింది. రామారావుకు సత్యాగ్రహం చేయవద్దని గాంధీజీ వ్రాశాడు. తాను మద్రాసులో వుండేందుకంటే ఈ గడ్డు రోజుల్ని ఏ పల్లెలో నయినా గడపటం మంచిదని చెప్పి, రామారావు హైమతో ప్రయాణమై కర్నూలుసమీపంలో గల తాతగారి గ్రామం చేరుకున్నాడు. అక్కడ ఒక ఇల్లు తప్ప మరో ఆస్తి లేదు. ఏలాగో ఒకలాగు జీవితం గడుపుకొందామని చెప్పి ఆ పల్లె చేరుకున్నాడు.

*      *      *      *

ఆ రోజుల్లో 'వార్ ఫండ్' (యుద్ధనిధి) అనే పేరుతో ప్రభుత్వం ప్రజల్ని దోచటానికి మొదలు పెట్టింది. కాస్త పలుకుబడి గలవాళ్ళకు రావుబహదూరు, రావుసాహెబ్ అనే బిరుదుల్ని వేలంవేసి డబ్బులాగుతూ వుండటం కూడా ఆ కార్యక్రమంలో ఒక భాగమే! మన రామారావు చేరిన గ్రామంలో అక్షరాలురాని ఒక రావుబహదూర్ వుండే వాడు. బ్రిటిషు ప్రభుత్వం తనను జిల్లాబోర్డు ప్రెసిడెంటుగా చేస్తుందని అతని ఊహ. దాంతో ఆ పల్లెటూరిలోని రైతుల నందర్నీ కొల్లగొట్టి, యుద్ధనిధికి వసూలు చేసి పంపి బ్రిటిషు వారి మెప్పుపొందుదామని ప్రయత్నిస్తూవుండినాడు. అలాంటప్పుడు రామారావు ఆవూరిలో చేరట మతని కెంతైనా సంకటంగా వుండింది. రామారావు నెలా 'పుటం' పెట్టాల్నా అని ఆలోచిస్తూవుండినాడు.

రామారావు నిత్యదరిద్రం వెళ్ళబోయవలసి వచ్చింది. హైమ ఆ దారిద్ర్యనరకంలోనూ అతనికి నిత్యసౌఖ్యం కలిగించేందుకు ప్రయత్నిస్తూ వచ్చింది. ఇద్దరూ ఉదయం నిద్ర లేవగానే రాట్నం ముందుపెట్టుకొని నూలుతీసేవారు. ఆ తర్వాత స్నానంచేసి, కలిగిన అన్నం తినేవారు. వార్ధాలో నేర్చుకొన్న చెక్కపని రామారావుకిప్పు డెంతో ఉపయోగ పడింది. మధ్యాహ్నంపూట చెక్కపని చేసి, ఆ వస్తువులను కర్నూల్లో అమ్మగా ఆ వచ్చిన నాల్గుడబ్బులతో ఇద్దరూ నిరాడంబర జీవితం గడపసాగారు. ఇద్దరికీ చదువుంది— తెలివితేట లున్నాయి. కాని, కాలం అలా మారిపోయింది. కాంగ్రెసువాదు లెవరూ సహాయంచేసే స్థితిలో లేరు. ప్రతి

వాహూ 93 వ సెక్షన్ నిరంకుశ పరిపాలనకు దద్దరిల్లిపోతున్నారు. అందుకోసం రామారావంతటి సమర్థుడు ఈ దుర్భర జీవితం గడపవలసి వచ్చింది.

ఆ రావుబహాదూరుకు రామారావు నెలా అయినా ఊరు వెళ్ళగొట్టాలనే పట్టుదల కలిగింది. అతడుంటే తన నిరంకుశత్వానికి అడ్డు అని ఆయన గుర్తించాడు. ఒకమారు సబ్ ఇన్స్పెక్టర్ చెవిలో సంగతంతా ఊది, యుద్ధనిధి వసూళ్ళకు అడ్డువచ్చాడనే నేరం పెట్టి అన్యాయం కేసు బనాయించి అతని ఇంటిని కాస్తా పొట్టబెట్టుకున్నాడు. ఇంక అతన్నెలాగయినాసరే జైలుకు పంపాలని నిశ్చయించుకున్నాడు.

ఆ ఇల్లు పోవటంతోనే రామారావు మాలరంగని గుడిసెవద్ద ఒక గుడిసె వేయించుకొని అక్కడ నివసిస్తున్నాడు. తమదగ్గరే నివాస మేర్పరచుకొని, తమలాగానే కష్టపడుతూన్న రామారావు దంపతులపై ఆ మాల గూడెం లోని పెద్దలు మొదలుకొని పిల్లలవరకూ అందరికీ గురుభావమే!

హైమ తాము పడ్డ సుఖాలనూ, ఇప్పుడు తమకు కలిగిన కష్టాలనూ తలచుకొని వాపోయేది. అలాంటప్పుడు రామారావు "పిచ్చిదానా! ఈ కష్టమంతా దేశంకోసమే! నీవుకాని, నేనుకాని ఐశ్వర్యాన్ని వెంటబెట్టుకొని యేమైనా పోగలమా?" అని ఓదార్చేవాడు.

కొంతకాలానికి – ఆ గంపెడు కష్టాల్లోనే, ఆ పూరి గుడిసెలోనే హైమ గర్భందాల్చింది. నవమాసాలు నిం

డాయి. ఒకవంక తమ కష్టాలకు రామారావు చింతించినా, ప్రసవంవిషయమై తలచుకొనేసరికి చిరునవ్వు అతని పెదవులపై రాజ్యంచేసేది. ఆ మాలెతలంతా హైమకు వేవుళ్ళు చేశారు. ఆమె ప్రసవంకోసం ఆ మాలవాడంతా ఎదురుచూస్తున్నది.

రావుబహదూరుగారు క్రొత్తగా కట్టిన తన ఇంటిలో గృహప్రవేశోత్సవానికిగాను ఒక తెల్ల అడ్వైజరును పిలుచుకవచ్చేందుకు ఏర్పాట్లుచేశాడు. ఆయన తన గ్రామానికి వచ్చినప్పుడు కాంగ్రెసు జెండాకానీ, కాంగ్రెసువాడుకానీ కనిపిస్తే తన తల ఎగిరిపోతుం దనుకున్నాడు, పాపం!

* * * *

ఆ నాటికి భారతదేశపరిస్థితి చాలా అధ్వాన్నమైపోయింది. 1940 సం.లో జైలుకుపోయిన నాయకులను బ్రిటిషుప్రభుత్వం క్రిప్సుతో రాయబారాలకోసం విడుదల చేసింది. యూరపుఖండమంతా యుద్ధజ్వాలలతో కుమిలిపోసాగింది. ఇంచుమించు అన్ని దేశాలకూ యుద్ధజ్వాలలు ప్రాకినాయి. జర్మన్ హిట్లర్ గ్రీష్మమధ్యాహ్నసూర్యునిలా ప్రకాశింప సాగాడు. ఆ ప్రకాశానికీ, ఆ మహోష్ణానికీ బ్రిటిషు సామ్రాజ్యలత వాడిపోసాగింది.

ఆసియాఖండంవైపు జపాను విజృంభించబోతూవుండటం మూలాన బ్రిటిషువారి గుండెలు చెదిరాయి. భారతదేశం జపాన్ యుద్ధానికి ఆహుతి కాగలదని వారు తలపోశారు. ఏదో ఒకవిధమైన రాజకీయచతురత (Diplo-

macy)తో భారతప్రజను యుద్ధానికి సుముఖంగా వుండేట్లు చేయాలనే ఆలోచనలు చేయసాగింది బ్రిటిషుప్రభుత్వం. పిడుగువంటి చర్చిల్ ఏదో ఒక క్రొత్తరకమైన బూటకపు పథకాన్ని తయారుచేసి క్రిప్సును భారతదేశానికి పంపేందుకు నిర్ణయించాడు. జైళ్ళల్లో వ్యక్తిసత్యాగ్రహంవల్ల (1940 సం.) బంధింపబడిన రాజకీయనాయకులను రాయబారాలకోసం వదిలిపెట్టమని బ్రిటిషు ప్రభుత్వంవారి ఫరమానా.

భారతదేశం భవిష్యత్తుకు మరలా ఎదురుచూడసాగింది. నాయకులు జైళ్ళనుండి బయటికి రాగానే దేశంలో ఉపన్యాసాలవర్షం కురిపించారు. యుద్ధకాల శాసనాలచేత ప్రమాన్పడిపోయిన భారతప్రజాహృదయాలు పునరుజ్జీవితమయ్యాయి. అడుగంటిపోబోయిన స్వాతంత్ర్యభావం నవనవోత్తేజితమైంది. ఏ నాయకుల దర్శనానికై కన్నులువాచినట్లు ఎదురుచూచారో, ఏ నాయకుల మృదు మధుర గంభీరోపన్యాసాలకై చెవులు నిక్కపొడుచుకొని వుండినారో, ఏ నాయకుల పత్రికాప్రకటనలకై, ఉద్యమాహ్వానానికై ఎదురుచూస్తూ వుండినారో - అలాంటి నాయకుల దర్శనం, ఉపన్యాసాలు, పత్రికా ప్రకటనలు, ఉద్యమానికి పిలుపులూ మరలా ప్రజలు అందుకోగలిగారు. యూరపుఖండంలో యుద్ధతీవ్రతలాగా, భారతదేశంలో స్వాతంత్ర్యోద్యమ తీవ్రత శతాధికమైంది.

క్రిప్సు ఒక పాచిక వేశాడు—ఒక నాటకం ఆడాడు. ఇదిగో వాగ్దానా లన్నాడు. ఇవేవీ కాంగ్రెసునాయకులను

వంచింపలేకపోయాయి. చివరకు నిరాశతో భారతదేశాన్ని వదిలిపోతూ "మీరు చూపిన సుహృద్భావానికి కృతజ్ఞుణ్నే కాని, నా రాయబారాలు ఫలింపకపోయినందులకు చింతిస్తున్నా" నన్నాడు. ఆసేతు హిమాచలపర్యంతం భారతదేశంలో ఉద్యమసన్నాహాలు మొదలయ్యాయి. స్వాతంత్ర్యకాంక్ష ప్రతిభారతీయుణ్ణీ ఒక ఊపు ఊపింది.

రాయబారాలు విఫలంకావటంతోనే కాంగ్రెసు ఏదో ఒక స్థిరనిర్ణయానికి రావాలని నిశ్చయించుకొన్నది. దేశం యావత్తూ ఉద్యమోన్ముఖమై వున్నట్లు కాంగ్రెసు గుర్తించింది. 1942 సం. ఆగస్టు 7, 8, 9 తేదీల్లో అఖిల భారత కాంగ్రెసు సమావేశాన్ని నిర్ణయించారు పెద్దలు. ఆనాటికి ఏదో ఒకవిధమైన కార్యక్రమం ఏర్పరచాలనుకున్నారు.

నాయకులంతా బొంబాయి చేరుకున్నారు. ఆ సమావేశాన్ని చూచి బ్రిటిషుప్రభుత్వం దద్దరిల్లిపోవాలన్నట్లు బొంబాయి పట్టకుండా కాంగ్రెసువాదులు వచ్చారు. మైకుల్లా మైదానంలో సమావేశం. నాయకులను చూస్తూవుంటే ప్రేక్షకుల హృదయాలు ఉప్పొంగిపోయేవి. ఆ వాతావరణం, ఆ సమారంభం ఇదివరలో ఎన్నడూ కనిపించలేదంటే అతిశయోక్తికాదు. పల్లెలనుండి, పట్నాలనుండీ పోయిన ప్రతివ్యక్తీ ఏ అరెస్టో, ఏ తుపాకిగుండుదెబ్బో, ఏ లాఠీఛార్జో తనకు స్వాగతం ఇస్తుందనే విషయం తెలిసేపోయాడు. నిర్ణీతకార్యక్రమం తమచేతి కందుతుందనీ, ఆ

కార్యక్రమంతో బ్రిటిషువారిని దేశంనుండి తరుమగొట్టాలని ప్రతివాడూ సభలో ఎదురుచూస్తుండినాడు.

గాంధీమహాత్ముని ఆదేశానుసారం ఆ సమావేశంలో "క్విట్ ఇండియా!" తీర్మానం ముక్తకంఠంతో, కరతాళ ధ్వనులమధ్య, జై జై శబ్దాలు మిన్నుముట్టుతూ వుండగా తీర్మానింపబడింది. సభను ఆనాటికి వాయిదా వేశారు. మరు సటిరోజున "క్విట్ ఇండియా!" తీర్మాన మెలా వుండవల సిందీ నిర్ణయిస్తా మనుకొన్నది అఖిలభారత కాంగ్రెసు.

"క్విట్ ఇండియా!" తీర్మాన కార్యకలాపాలను బొంబాయి ప్రభుత్వం వైస్రాయికి తెలియజేసింది. కొంచె మైనా విచక్షణజ్ఞానం లేని వైస్రాయి లిన్‌లిత్‌గో నాయకు లను బంధించమని ఆజ్ఞాపించాడు. ఆ వార్త బొంబాయి ప్రభుత్వానికి రాత్రి 2 గం. కు చేరింది. తెల్లవారుజామున నాయకులందర్నీ వారివారి బసలవద్దనే అరెస్టుచేసి చీకటి విచ్చకముందే బొంబాయినగరంనుండి ప్రత్యేకపురైళ్ళలో ప్రవాసానికి పంపివేశారు. అఖిలభారత కాంగ్రెసు సభ్యు లకూ, తదితర కాంగ్రెసు వాదులకూ వారంట్లు జారీచేయ బడ్డాయి.

నాయకుల అరెస్టు వార్తలు విన్న ప్రజానీకానికి వళ్ళు పులకరించింది. బ్రిటిషువారి కుటిలరాజనీతి వారిని ఉద్రిక్తులను చేసింది. అరెస్టు వార్తలు దేశంలో మూల మూలలకూ ప్రాకిపోయినాయి. ఇంచుమించు ప్రతికాంగ్రెసు వాదీ అరెస్టు చేయబడ్డాడు. ఉద్రిక్తులైన ప్రజలు విధ్వంసక

కార్య కలాపాలకు కడగినారు. రైళ్ళు, రైల్వేస్టేషన్లు, ప్రభుత్వభవనాలు, బ్యాంకులు తగులబెట్టబడ్డాయి. రైల్వే వంతెనలను పగులగొట్టారు. రైల్వేలైన్లను పీకిపారవేశారు. ఉద్యోగులను వధించటానికి పూనుకొన్నారు. ప్రభుత్వం స్తంభించి పోయింది.

ఈ అరాజకాన్ని అణిచేందుకు బ్రిటిషుప్రభుత్వం ఎన్నో ఆర్డినెన్సులు జారీచేసింది. దేశమంతటినీ విచ్చు కత్తుల పారాలో పెట్టి, తుపాకీ గుండ్లతోనూ, పోలీసు - మిలిటరీ బందోబస్తుతోనూ ఆత్మరక్షణ చేసుకొన్నది ప్రభుత్వం. ఆనాడు బ్రిటిషు ప్రభుత్వం చేసిన అత్యాచారాలు* ఘోరాతిఘోరమైన క్రూరమార్గం కానివి. అవి తలచుకొన్నట్లయితే భారతీయుని హృదయం మండిపోతుంది. ఇలాంటి ఘట్టాలు ప్రపంచచరిత్రలో ఏ రెండు మూడుమాత్రమో కనిపిస్తాయి.

ఎప్పుడైతే కాంగ్రెసువాళ్ళు జైళ్ళపాలయ్యారో ఆ వెంటనే బ్రిటిషువారి గులాములుగానూ, ఇండియాలో సామ్రాజ్యవాద నివాసానికి కారణభూతులుగానూ ఉన్నటు

---

*The newspapers contained heavily censored news . ...thousands (of people) lay in prison on internment camp without trial, that thousands had been shot to death, that tens of thousands had been driven out of schools and colleges, that something indistinguishable from martial law prevailed over the whole country, that terror and frightfulness darkened the land...... *'Discovery of India'* by Pandit Nehru.

వంటి రావుబహదూర్, దివాన్‌బహదూర్లు పదవులకోసం ప్రాకులాడటం మొదలుపెట్టారు. బ్రిటిషువాళ్ళుకూడా తమ దొంగాటకం యథాప్రకారం సాగేనిమిత్తం తమ ఆఫీసుల ముందు పడిగాపులుపడి తిరుగుతూవుండే ఈ పెద్దమనుషుల నోళ్ళకు ఉద్యోగాలుకొట్టటం ప్రారంభించారు. అలాంటి హోదాల దేవులాటగాళ్ళలో రామారావుండే పల్లెటూరి రావుబహదూరు ఒకడు.

ప్రభుత్వంవారు అన్నిచోట్లా నామినేటెడ్ డిస్ట్రిక్టు బోర్డులు ఏర్పరుస్తున్నా కర్నూలు జిల్లాకుమాత్రం ఇంకా ఏర్పరచలేదు. రావుబహదూరు తెల్లవాళ్ళదగ్గరకు పోవలసిన హుందాతో అనేకపర్యాయాలు పోయిపోయి మొరపెట్టుకున్నాడు. ఇదిగో ఆర్డరు వేస్తాం-అదిగో ఆర్డరు వేస్తామంటూ నెలలు గడపసాగారు. అసలు కీలక మెక్కడుందో రావుబహదూరు గమనించాడు. ఏదో ఒక పేరుతో గవర్నరుకు ప్రథమసలహాదారుడుగా వున్న తెల్లదొరను పిలిచి తగిన సన్మానం చేయకతప్పదు. అందుకు తాను క్రొత్తగా కట్టించిన బంగళాకు ప్రారంభోత్సవం ఆ అడ్వైజరుచేత చేయిద్దామనుకొని ఆయన్ను ఒప్పించుకొన్నాడు. రెండు నెలలు వ్యవధిగా తేదీ నిర్ణయమైంది. జిల్లాలో వుండే తన మద్దతుదార్ల నందరినీ పిలిపించాలనీ, అడ్వైజరుకు ఆహారమంతా మద్రాసు స్పెన్సరునుండే తెప్పించేందుకూ ఏర్పాట్లు చురుకుగా సాగింపసాగాడు. ఇంత చేస్తున్నా అతనికి ఒకే ఒక బెంగ పట్టుకొని వేధింపసాగింది. అది రామారావును గూర్చిన బెంగ. రామారావు ఆనాటికి ఊళ్ళోనే వున్నట్లైతే

ఏదో ఒక విధంగా రసాభాసు చేస్తాడని ఆయనభయం. ఆ భయంతో, అతన్ని వెంటనే ఇండియా దేశరక్షణచట్టం క్రింద పట్టించివేస్తే పీడ వగ తెగిపోతుం దనుకున్నాడు. దానికి ప్రయత్నాలు చురుకుగా చేయబడ్డాయి.

*　　*　　*　　*

హైమ నిండు చూలాలు. నేడో రేపో ప్రసవించే ట్లుంది. దేశంలో ఉద్యమతీవ్రత ఎలా వ్యాపిస్తుందీ రామా రావు పత్రికల ద్వారా గమనిస్తున్నాడు. కాని, అతడు ఏమీ చేయలేని స్థితి వచ్చింది. హైమ సుఖప్రసవమై, బిడ్డకూ, తల్లికీ పాలూ నీళ్ళూ ఏర్పడేవరకూ కట్టుకదలటానికి వీల్లేదు. అతని మనస్సులో బ్రిటిషువారి దమననీతికి ప్రతి కూలాగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లుతున్నాయి. ఆయన ధ్యానంలో ఉద్యమభిన్నస్వరూపాలు స్ఫారిచేస్తున్నాయి. అతని గుండెల్లో పదునుకత్తులు పొడుచుకున్నట్లౌతున్నది. కాని – ఏం చేయ గలడు? కాలం కలిసిరాలేదు. ప్రపంచ వ్యవహారాలూ, యుద్ధాన్ని గూర్చిన వింతలూ విశేషాలూ తెలుసుకోనేం దుకు మాలగూడెంలోని పిన్నలూ పెద్దలూ రామారావు గుడిసెకు వచ్చేవారు. రామారావు ఆ అన్నివిషయాలూ పూసగ్రుచ్చినట్లు చెప్పుతూవుంటే విని, హైమను పలుక రించి, పిమ్మట ఆ హరిజనులు ఎవరిదారిని వారు పోతూ వుండటం అలవాటు.

హైమకు ప్రసవలక్షణాలు అగుపించాయి. ఆవిష యం ఆమె రామారావుతో చెప్పింది. అతడు వెంటనే

కర్నూలుకు మనిషిని పంపి, హరిజనుల్ని సహాయానికి రమ్మన్నాడు. హైమకు నిమిషనిమిషానికీ బాధ ఎక్కువ కాసాగింది. నొప్పు లతిశయించాయి. ఒకే అలమటింపు. రామారావుకు గుండె చెదరి మూలబడిపోయాడు. అతని కళ్ళు లోతుకు పోయాయి. ముఖంలో నెత్తురుబొట్టు కనిపించటం లేదు. ఆయనహృదయంలో తుపాను చెలరేగింది. చూపులో భూకంపం వచ్చిన ట్లైంది. డాక్టరు ఇంకా రాలేదు. గూడెంలోని హరిజను లెంతధైర్యం చెప్పినా ఆయనమనస్సు కోలుకోకపోవటమే గాక, అతనిలో చైతన్యమే లేదని చెప్పవచ్చు.

గుఱ్ఱపు బండి చప్పుడైంది. డాక్టరు వచ్చాడని అందరూ ఎగాదిగా చూడసాగారు. బండి గుడిసెదగ్గరకు వచ్చి ఆగింది. అందులోనుండి ముగ్గురు పోలీసులతో ఒక సబ్ ఇన్స్పెక్టర్ క్రిందికి దిగాడు. హరిజనులు ముక్కుమీద వేలేసుకున్నారు. ఈ అద్భుతం ఆ అమాయికుల కర్థం కాలేదు. ఇన్స్పెక్టరుగారు రామారావును సమీపించి, చేయి పట్టుకొని బండిదగ్గరకు రమ్మన్నారు. అక్కడి ప్రజలు గొల్లు మన్నారు. పోలీసుల చేతుల్లోని తుపాకుల్ని చూపెట్టి భయపెట్టినా డా ఇన్స్పెక్టరు. రంగన్న ముందుకు వచ్చి రామారావుభార్య హైమవతమ్మ ప్రసవవేదన పడుతున్నదనీ, వీళ్ళు గొప్పకుటుంబంలో పుట్టినవాళ్లయినా కాలాని కిట్లు ఎదురీదుతున్నారనీ ఇన్స్పెక్టరుగారితో చెప్పుతుండగా ఆయన ఛళీమని చెంపమీద దెబ్బకొట్టాడు. రంగన్న అరచేతిని పారజూడగా రామారావు నిరోధించాడు.

ఈ గందరగోళం జరుగుతూండగా వెంటనే ఇద్దరు పెద్దమనుషులు పరుగెత్తుతూ వెళ్ళి రావుబహాదూరును కలుసుకొన్నారు. హైమ ప్రసవ వేదనతో వుండటమూ, రామారావును పట్టుకోటానికి పోలీసులు రావటమూ మొదలైన విషయాలు విన్నవించగా ఆయన ఏమీ తెలియనివానిలాగా విన్నాడు. వెంటనే వారితో బయలుదేరి క్రొత్తపాచిక వేస్తామనుకున్నాడు. రావుబహాదూరును చూట్టంతోటే నమస్కరించి, ఇన్స్పెక్టర్ చిరునవ్వుతో పలుకరించాడు. రావుబహాదూరు ప్రతినమస్కారంతోపాటు విసిరాడొక చిరునవ్వు. పైకిమాత్రం "బాబూ! రామారావును వదలండి. ఆయనభార్య ప్రసవించే సమయంగా వుంది." అని అన్నాడు. ఆ అవకాశాన్ని పురస్కరించుకొని ఇన్స్పెక్టరు "అలా వదలటానికి వీల్లేదు. తక్షణం అరెస్టుచేసి తీసుకరమ్మంటూ మాకు ఉత్తరువులున్నాయి. ఒక మార్గంతో అయితేమేం వదలిపెట్టి పోవచ్చు. రామారావుగారు ఋద్దరు వేయననీ, ఇకమీద కాంగ్రెసులో చేరననీ క్షమాపణాపత్రం వ్రాసివ్వాలి. అలాఅయితే నేను తోడ్పడుతాను." అనేసరికి రామారావు గ్రుడ్లు చింతనిప్పు లయ్యాయి. "ఛీ, నీచుడా! ఏమన్నావు? ఏ ఆశయంకోసం, ఏ పవిత్రకర్తవ్యం కోసం ఇంతకాలం నేను పోరాడానో - ఆ ఆశయం, ఆ కర్తవ్యం క్షణభంగురాలైన సుఖదుఃఖాలతో ముడిపెట్టి బూదిలో కలుపుకొంటానా? వేలతరబడిగా జైళ్ళలో మ్రగ్గుతూ, దేశస్వాతంత్ర్యంకోసం తమ సర్వస్వాన్నీ ధారపోసిన కాంగ్రెసువాదులకు నేను తలవంపులు తేను. ఈ

రోజుతో నా జీవితంలో విషఘుడియలు ప్రారంభమైనాయి. నవ్వు మొగంతో ఉరికంబాన్ని కౌగిలించుకొన్న భగత్ సింగు ఆత్మ నన్ను ప్రేరేపిస్తోంది. ఈ రావుబహదూర్ల దోపిడీలకు దేశం రెండుసంవత్సరాలైనా తట్టుకుంటే బాగుపడుతుంది.'' అంటూండగా ఇన్స్పెక్టరు ఆయననోరు మూశాడు. మూసి, చేతులకు బేడీలు వేయమని ప్రక్కనున్న పోలీసులకు సంజ్ఞ చేయగానే వా రాపని చేశారు. బలవంతంగా రామారావును బండిఎక్కించారు. రామారావు వెఱ్ఱి ఆవేశంతో ''క్విట్ ఇండియా!'' అంటూ, ''విప్లవం వర్ధిల్లాలి!'' అని అరిచేసరికి గూడెమంతా మారుమ్రోగింది. రావుబహదూరు బిత్తరిచూపులు చూస్తున్నాడు. గూడెంలోని హరిజనులా ఉద్రేకాన్ని ఆపుకోలేక వీరావేశం కనబరుస్తున్నారు. వారి నుద్దేశించి ''మీరంతా శాంతంతో మీమీ ఇండ్లకు పొండి. మహాత్మాగాంధీని జ్ఞాపకం చేసుకొని అహింసాసిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టండి.'' అంటూ మరలా ''క్విట్ ఇండియా!'' అనీ, ''విప్లవం వర్ధిల్లాలి!'' అనీ నినాదాలు చేశాడు. బండి కదిలింది.

హైమ వున్న గదిలోనుండి ఒక బ్రహ్మాండమైన కేక వినబడింది. హరిజనులంతా పరుగుపరుగున లోపలికి వెళ్ళారు. రామారావు గుండె గుభేలు మన్నది. రావుబహదూరు మాత్రం మదపుటేనుగువలె మోస్తరు నడుస్తూ ఇంటికేసి వెళ్ళుతున్నాడు.

హైమవతి ప్రసవవేదనతో బాధపడుతూండగా భర్తను పట్టుకపోతున్నా రన్నమాట ఆమె చెవినిపడింది.

దాంతో గుండె చెదరటం మూలాన ఆ చావు కేకతోనే ఆమె ఈ ప్రపంచబాంధవ్యాన్ని వదులుకున్నది.

హరిజనులు ఆ ఆవేశాన్ని అణుచుకోలేకపోయారు. వారి నడ్డుపెట్టేవా డెవ్వడూ లేడు. రామారావు కష్టనష్టాల కంతా కారకుడు రావుబహదూరు. ఆ కిరాతకుడు నూత్న గృహప్రవేశం చేయకూడదు. వాని దుర్మార్గానికి రామారావుకుటుంబం ఎలా బలి అయిందో అలా మన ఆవేశానికి వాని నూతనగృహం ఆహుతికావాలి అనుకొని మాలెగూడె మంతా కదిలింది. రావుబహదూరుగృహం దగ్ధమైంది. శేషించింది బూడిదమాత్రమే! తెల్లవార కార్యక్రమం అలాగే నిలిచిపోయింది.

హైమఆత్మ శాంతించలేదు. రామారావు ఏలూరులో నిర్బంధితుడైనాడు. ఆయనజీవితంలో అంధకారం ఆవరించింది. ఇంక జరుగబోయే దేమిటి? †

---

† తరువాత రామారావుచరిత్ర ఏమిటి? మహోజ్జ్వలంగా వుంటుంది ఆచరిత్ర. "కాంగ్రెసుకథలు" రెండవ భాగంలో మిగిలిన ఆ కథను చదవండి.

# 3. బాబూ గన్నో

"ఈ అబ్బాయి ఎందుకూ, ఏమీ పనికిరాడని తోస్తుంది. ఏమి చేయాలో తెలీదు." అని నిట్టూర్చేది తల్లి.

"మనకు పనికిరానీ, రాకపోనీ ఈశ్వరునికి ఇతన్ని సృష్టించడంలో ఏదో ప్రయోజన ముండకపోదు." అనే వాడు తండ్రి.

ఈ సంభాషణంతా పదేండ్ల అబ్బాయి బాబూ గన్నోను గురించే.

అతని రూపమూ, అతని చలాకీతనమూ ఏమీ లెక్కించతగినవి కావు. ఇక బుద్ధీ ఆమాత్రము దే-అన్నాడు బళ్ళో ఉపాధ్యాయుడు. ఆ ముఖంలో ఒకవిధమైన మాంద్యం కనబడేది. ఆ మాటలలోనూ కరకుదనమే కనబడేది.

సంపన్నుల ఇంటి కుర్రవాళ్ళకు వున్న సౌకర్యాలన్నీ బాబూ గన్నోకు కూడా వున్నాయి. కాని, తన తల్లి తండ్రుల ఐశ్వర్యాన్ని అతడు ఏమాత్రమూ ఉపయోగించుకోలేదు. తన మాసిన బట్టలూ, చెదరిన క్రాపూ అతడెప్పుడూ సరిచేసుకోలేదు.

బొంబాయినగరంలో వీథులవెంబడి పోయే మనిషి ప్రతీ అంగడినీ గమనిస్తూపోతే ఎంతకాలానికి అతడు ఇల్లు చేరుకోగలడు? కాని - బాబూ గన్నో ప్రతిదినమూ ఆ

పద్ధతినే అనుసరించేవాడు. ఇల్లు చేరే వేళకు ఇంతింతనరాని ఆలస్యం—

ఆ రోజుల్లో స్కూలును గురించి అతని కుండే అభిప్రాయ మెలాంటిదో చెప్పటం కష్టం. ప్రతిదినమూ చక్కగా ముస్తాబు చేసుకొని తనతో స్కూలుకు వస్తూన్న పిల్లలతోబాటు కాలేజీకి ఇంకా తానెక్కవలసిన మెట్లు లెక్క పెడుతూన్నాడా?

ఒక్కొక్కప్పుడు రాత్రి ఎనిమిది గంటలవేళ తాలింఖానాలో కసరత్ చేసి అలసి వెలుపలికి వస్తూన్న పైల్వాన్ల శరీర సౌష్ఠవాన్ని చూచి చూచి ముగ్ధుడౌతూన్నాడా?

తన ఇంటికి రోజూ తెల్లవారేసరికి వస్తూ బలవంతంగా పాఠం చెప్పిపోతూవున్న సంస్కృతపండితుణ్ణి చూచి విస్మయ పడుతూ వున్నాడా?

నిత్యమూ గాంధీమహాత్మునికి పూజచేయనిదే పచ్చి మంచినీళ్ళు ముట్టని తల్లిదండ్రులను చూచి ఆశ్చర్యపడుతూ వున్నాడా?

ఆ కాలంలో తెల్లదొరలంటే ప్రతిభారతీయునికీ ఒక విధమైన భయం. దానికి తగినట్లే ఆ తెల్లదొరలూ నల్ల వాళ్ళను చూస్తే అమితంగా అసహ్యించుకొనే వారు. బాబూ గన్నో మాత్రము ఆ దొరలను చాలా నిగాగా చూస్తూవుండేవాడు – తాను వారికి తొలగిపోయేవాడు – అతని ముఖంలో మాత్రము ఏ భావమూ కనబడేది కాదు.

కుమారుని ఈ అవ్యక్తస్థితీ, ప్రపంచముపైనసే అత డప్పుడు చూపే నిరాదరణా తల్లిదండ్రులను వ్యాకులిగా విసి గించినాయి.

ఒకనాడు తల్లీ, తండ్రీ ఇద్దరూ కూర్చున్నారు. తల్లి పిలిచింది :

"గన్నో !"

"ఆ !"

"ఇల్లా రారాదూ పిలిస్తేనూ ?"

"ఎందుకూ ?"

ఈ ఎదురుప్రశ్న తండ్రికి కోపం తెప్పించింది.

"వస్తావా, లేదా - వాగక !"

"వస్తున్నా."

వచ్చి నిలిచాడు. తండ్రి ఇలా అన్నాడు :

"నీ పద్ధతి ఏమీ బాగులేదు. చదువు సరిగా చదువు కోవు. ఇంట్లోనూ ఉత్సాహంగా వుండవు. నీ కథ ఏమిటో తెలిసింది కాదు. అందుకే పిలిచా."

"నేను చదువలేమూ ? ఎవరు చెప్పారు మీకు !"

"ఎవరో ఎందుకు చెబుతారోయ్ ! మీ మాష్టారే చెబుతారు."

"ఏమని ?"

"చదువలేదని." గుర్రురిమి చూచినాడు తండ్రి.

గన్నో చలించలేదు.

"నే నే సబ్జెక్టులోనూ ఫేలు కాలేదు. కావలిస్తే ప్రోగ్రెసురిపోర్టు చూచుకోండి."

"ముప్ఫయి అయిదు మార్కులు వచ్చినాయనా నీ పొగరు ?"

"మ రింకెన్ని రావాలి ?"

"ప్రతివాడూ అరవై డెబ్భై మార్కులు తెస్తూ వుంటే ముప్ఫయి అయిదింటికే మురుస్తున్నావు నీవు !"

"ప్యాసుకావడానికి ఎన్ని మార్కులు కావాలో అన్ని మార్కులు తప్పకుండా తెచ్చుకుంటాను - అంతకంటే ఒక్క మార్కుకూడా నాకు ఎక్కువగా అక్కరలేదు. ఫేలైతే అడగండి."

"అయితే రేపు పరీక్షలకు నలభై మార్కులు వస్తేనే గాని ప్యాసుచేయమంటా రనుకో - అప్పు డేమిచేస్తావ్ ?"

"నలభై మార్కులూ తెస్తాను."

నిక్కచ్చిగా ఈ మాట చెప్పి గంభీరంగా వెళ్ళి పోయాడు. తల్లిదండ్రులు మళ్ళీ ఆలోచనలో పడ్డారు.

* * * *

గాంధీమహాత్ముని స్వాతంత్ర్య శంఖారావం ఆసేతు హిమాచలమూ భారతీయులను ముంచెత్తింది. ప్రతివాడూ దేశమూ, ఖద్దరూ, రాటమూ అనే పదాలు ప్రతీదినమూ

వింటున్నారు. ఆ కాలంలో బొంబాయినగర వైభవము చెప్పడం మహాకవులకుకూడా సాధ్యంకాదు.

వల్లభాయి పటేలు, లజపతిరాయ్, మోతీలాలు, జవహరులాలు మొదలైన దేశనాయకుల ఉపన్యాసాలకు బొంబాయి సముద్రమై పొంగిపోయిందంటే వింతకాదు.

మన జాతిలోని చైతన్యము పూర్తిగా నశించిందని ఉపన్యాసకు లెవరైనా అన్నంతమాత్రములో ప్రజలందరూ ఒక్కసారిగా ఉద్రిక్తులై తమతమ శరీరాల్ని నిగాగా చూచుకొని నిట్టూర్పులు పుచ్చేవారు. వారి కన్నులలో, ముఖములలో ఒక మహాజ్వాల కనిపించేది. "రేపటినుంచి మీరందరూ ఖద్దరు వడికితీరాలి - మీ రట్లు ప్రతిజ్ఞచేసుకోవాలి" అని నాయకుడు గర్జించినాడా ఇక మరునాటి కల్లా, వేలకొలది సభ్యులు చేకదుర్లతో తయార్ !

సామాన్యంగా నగరాల్లో సాయంకాలము జవుళీ వ్యాపారానికి మంచి సమయము. రాత్రిపూట ఆ విద్యుద్దీపాల తళతళలలో, ఆ అద్దాల బీరువాల్లో అందంగా పేర్చిన ఆ వస్త్రాల్ని చూచి ముగ్ధుడు కానివాడు ఉండడు. పైగా ఆ వర్తకుల ధాయానే వేరు - వారి మర్యాదల తీరే వేరు. వారి మృదువైన మాటలకూ, వారి జమీందారీ ధాయా మర్యాదలకూ, ఆ వితరణకూ లొంగి ప్రతీవాడూ రూపాయి గుడ్డకు రూపాయిన్నర పెట్టి కొనేవాడు. కాని, ఈ ఉపన్యాసాలు మొదలైనతర్వాత ఈ స్థితి చిత్రంగా మారి పోయింది. సాయంకాలం ఐదైందంటే అంగళ్ళు బంద్ ! ప

పైకుల్లాకో, ఏ సముద్రతీరానికో, ఇంకే మైదానానికో ప్రతీవర్తకుడూ వెళ్ళేవాడు. అక్కడ ఏ వల్లభాయిపటేలు ఉపన్యాసమో వుంటుంది. ఆ ఉపన్యాసాన్ని ప్రత్యక్షరమూ తప్పకుండా వినేవాడు-కాదు, ఆఉపన్యాసాన్ని త్రాగేవాడు. మళ్ళీ ఇంటికి వచ్చేవాడు.

బొంబాయి ప్రజల చెవుల్లో పంచాక్షరీమంత్రం మారుమ్రోగేది. అది శివపంచాక్షరి కాదు. "విదేశీ చోడ్‌దేవ్" లేదా "స్వదేశీ పేక్ లేవ్"

కాని, ఆ నగరములోనే ఇంకొకరకమైన వర్తకులు కూడా వుంటారు. ఆ గుంపువారంతా పై పంచాక్షరీ మంత్రాలను బాహాటంగా ఉచ్చరించేవారు - ఖద్దరు ధరించేవారు. కాని, లోపలమాత్రం లారీలతో మిల్లుగుడ్డలు రహస్యంగా అమ్ముకొనేవారు. ఈ దొంగతనాల్ని ఆపడం ఎట్లా అనే సమస్య ఒకటి కాంగ్రెసువాళ్ళను వేధించింది. ఎంతకూ అది తెమలలేదు. నిరంతరమూ స్వలాభాలకోసం తపించేవాళ్ళను మార్చడానికి ఎంతకాలం కావాలో, ఎన్ని ప్రాణాలు బలిపెట్టాలో ఎవడు చెప్పగలడు ?

ఇంతలో రాజకీయవాతావరణం మరింత తీవ్రస్వరూపాన్ని పొందింది. గాంధీమహాత్ముడు తన ఉపన్యాసాలతో దేశమును, ప్రభుత్వాన్నీ గడగడ వడకించివేస్తూవున్నాడు. అతని ఉపన్యాసాలలో అగ్నిజ్వాలలు లేవు - పిడుగులు లేవు. వాటిని వడగళ్ళవానతో పోల్చవచ్చు. వాటిలో వేడిలేదు - పటిష్ఠత వున్నది.

ఇర్విన్ ప్రభువు రాజకీయ నాయకులను రాజద్రోహ నేరంక్రింద అరెస్టుచేయడం ప్రారంభించినాడు. సరి – అగ్నికి నేయి తోడైనట్లుగా అప్పుడే యువరాజాగమనం.

మహాత్ముడు సబర్మతీ ఆశ్రమానికి తన సహచరుల నందర్నీ రప్పించుకొన్నాడు. ఆలోచించినాడు. దేశంలో మహోద్యమం లేవదీయడానికి పూనుకొన్నాడు. సహచరుల సహాయ మభ్యర్థించినాడు. "మహాత్మా! మీరు ప్రార్థించవలసిన పని లేదు. ఆజ్ఞాపించవలె" అన్నారు సహచరులు. తల యూచినాడు ఆయన. ఆ సహచరుల సమూహంలో ఒక స్త్రీమూర్తి వున్నది. సముద్రపు నురుగులు ఆమె లేనవ్వులతో సాటిరావు. వినమ్రతతో కూర్చొనివున్న ఆమెవంక మహాత్ముడు చూచినాడు – "అమ్మా! ఉప్పు సత్యాగ్రహాన్ని సంపూర్ణ విజయవంతంగా చేసే బాధ్యత నీదే" నన్నట్లుగా. మహాప్రసాదమని ఆయనదీవన లందుకొన్నది ఆ శక్తిస్వరూపిణి, ఎవ రామె? – ఆమె శ్రీమతి సరోజినీ దేవి.

*          *          *          *

ఇదిగో కడపటి పోరాటమును మొదలుపెట్టబోతున్నాను, కాచుకొమ్మని రెజినాల్డు రైనాల్డుద్వారా గాంధీ మహాత్ముడు వైస్రాయికి సవాలుపంపినాడు. అతని యుద్ధ మెటువంటిది? ఆ యుద్ధములో ఆయుధము సత్యాగ్రహము. విజయము సాధించేవరకూ సబర్మతీ ఆశ్రమాన్ని కంటచూడ నని మహాత్ముడు శపథము చేసినాడు. మహానిష్ఠాగరిష్ఠుడై పాదచారిగా బయలు వెడలినాడు.

అతనితో ఏ ధర్మరాజూ పోలడు. ఏ శ్రీకృష్ణుడూ పోలడు. అతని దారే అతనిది.

సముద్రతీరము చేరినాడు. ఇదిగో ప్రభుత్వమును ధిక్కరిస్తా నన్నాడు. వెంటనే పోలీసులు ప్రత్యక్షం! సరే, ఇక చెప్పవలసినపని లేదు – అరెస్టు!

ఇంక ఉద్యమమే ఆగిపోతుందా? జనులందరూ మెర మెచ్చులకుగా ఆయనవెంట నడిచినవారేనా? – ఈ తలంపు లన్నీ ఒక్కక్షణమే!

"అదిగో – వందలూ, వేలూ వాలంటీర్లు. అహో! అగ్నిలో మిడుతలవలె పడిపోతున్నారే!" అనుకున్నారు కొందరు. "కాదు, హోమకుండములో స్వాతంత్ర్య దేవతకై తమ ప్రాణా లర్పిస్తున్నా"రని కొందరు.

గాంధీమహాత్ముడు ఇనుపకటకటాల్లో బంధింపబడిన వెంటనే ఆదిశక్తి స్వరూపిణి – అమృత స్వరూపిణి – శ్రీమతి సరోజినీదేవి ప్రజలకు ఒక సందేశాన్ని అందజేసింది: "ప్రభుత్వమువారు గాంధీమహాత్ముని భౌతికశరీరాన్నే బంధించినారు. అతని ఆధ్యాత్మికస్వరూపం మన హృదయ పీఠాల్లో సుప్రతిష్ఠితమైంది. అతడు వెలిగించిన స్వాతంత్ర్య జ్యోతి నిరాఘాటంగా వెలిగితీరగలదు."

ఈ సందేశంవిలువ ఆనాటి రాజకీయాలు చూచిన వాళ్ళకే తెలుస్తుంది. ప్రజలంతా మరొక్కసారి హుమ్మన్నారు. విప్లవాగ్నిలో దూకినారు.

ఆమె అంతటితో ఆగలేదు. వెంటనే బొంబాయి చేరుకొన్నది. విదేశీవస్త్ర బహిష్కరణాన్ని గూర్చి ఆనాడు సముద్రపు ఒడ్డున తన ఉపన్యాసాన్ని వర్షము కురిపిస్తూ వున్నది. ఆ ఉపన్యాసము వినడానికి వచ్చిన ప్రజలు వేలు, లక్షలు! ఆనాడు ప్రజాసమూహము బొంబాయిలో రెండు సముద్రాలు చూచింది. ఒకటి లవణసముద్రము - వేరొకటి మానవసముద్రము.

ఆమె ఉపన్యసిస్తూ ఇలా అన్నది: "ముప్ఫయి అయిదు కోట్ల భారతప్రజ తన గుడ్డ తాను ఉత్పత్తిచేసుకోలేదంటే అది మీకు అవమానకరంగా లేదా?" ఆమె మరల ఇలా ప్రశ్నిస్తూవున్నది: "మన దేశంలో తయారయ్యే ఉప్పు మనం తినగూడదా? ఇంతకూ కారణమైనదేది?"

ఆమె సిద్ధాంతం చేసింది:

"విదేశీ ప్రభుత్వం."

ఆమె తర్కిస్తూ వున్నది:

"ఎట్లా ఎదిరించడం?"

మరల ఆమె ఉపదేశిస్తున్నది:

"విదేశీని బహిష్కరించండి."

ఆమె తనంత తాను మరల ప్రశ్న వేసుకొన్నది:

"మనము బహిష్కరించలేమా?"

మరల నిర్ధారిస్తూవున్నది :

"తప్పకుండా బహిష్కరించగలం."

ఆమె ఆజ్ఞాపిస్తూవున్నది :

"ఈ కార్యము పూర్తిగా యువకుల చేతిలో వున్నది. యువకులు ముందుకు రావాలి. భారతమాతృచరణసన్నిధిని మీ ప్రాణములను బలిదానము చేయాలి. బ్రిటిషు సామ్రాజ్యం నేలకూలక తప్పదు – యువకులు ముందుకు రావాలి!"

ఒక్కసారిగా సభ నిస్తరంగసముద్ర మైంది. ఆమె ప్రార్థించినది :

"రాలేరా? భారతమాతృఋణము తీర్చలేరా?"

ఆమె కోపించినది :

"తల్లి ఋణము తీర్చలేని దరిద్రులా మీరు? భారతమాత గొడ్డుపోయిందా?"

ఆమె ఆ ఆవేశంలో ఇంకేమి చేయనుండేదో ఊహించలేము.

ఇంతలో ఆ సభలోనుంచి ఒక కేక—"పోలేదు – అమ్మా! భారతమాతృగర్భము గొడ్డుపోలేదు." సరోజినీదేవి ఆ ప్రక్కకు తిరిగిచూచింది. సభలో ఒక గగ్గోలు చెలరేగింది. ఒక మారుమూలనుండి ఒక చిన్న కుర్రవాడు త్రోవచేసుకొని వచ్చాడు. అంతవరకూ ఆదిశక్తిస్వరూపిణిగా వున్న సరోజినీదేవి అప్పుడు అమృతస్వరూపిణిగా మారింది.

"ఎవరు నాయనా నీవు?"

"నా పేరు బాబూ గన్నో."

"ఎందుకు వచ్చావ్?"

"భారతమాత గోడ్డుపోలేదని చెప్పటానికి."

"అయితే, అబ్బాయి, నీవు బ్రిటిషుప్రభుత్వాన్ని ఎదిర్చగలవా?"

"అమ్మా! తప్పకుండా ఎదిరిస్తాను. తల్లి ఋణం తీరుస్తాను."

"నాయనా! చిన్నవాడవు. మన సైన్యానికి ఆయుధాలు లేవు."

"తెలుసు. నాకు అహింస ఆయుధము. సత్యాగ్రహము నా వ్యూహము."

"అహింసను నమ్మినావా నాయనా నీవు?"

"ముంబాదేవి సాక్షిగా!"

ఈ సంభాషణ విన్న సభ్యుల మనస్సు ఎల్లా వుంటుందో చెప్పవలసిన ఆవశ్యకత లేదు. సరోజినీదేవి హృదయం పొంగిపోయింది. "ఇన్ని సుగుణాలు నీ కెట్లా పట్టుపడినాయి నాయనా! ఎంత పుణ్యము చేసుకొన్నారు నీ తల్లిదండ్రులు! ఈ దేశభక్తి నీ కెలా వచ్చిందోయి నాయనా?" అని సరోజినీదేవి ఆ అబ్బాయిచుబుకమును నిమిరి ముద్దు పెట్టుకొన్నది. అతని శిరస్సును ముక్తాభిషిక్తము చేసింది.

తల్లికంటే ఎక్కువ ప్రేమ కురిపిస్తూవున్న సరోజినీ దేవిని చూచి గన్నో మరల చిన్నవాడైనాడు. ముఖము పైన సిగ్గుతో వణికిసలాడుతూ ఇలా చెప్పినాడు :

"నా దేశభక్తికి కారణం మా తల్లిదండ్రులే—కాని వారి కొక ఆశ వున్నది. నేను మొదట గొప్ప పండితుడను కావాలనీ, ఆతర్వాత గొప్ప కార్యాలు చేయాలనీ. నేను మాత్రము మొదలు స్వరాజ్యం రావాలనీ, ఇప్పటి చదువు పనికిరాదనీ అనేవాణ్ణి. అయినా మా తల్లిదండ్రులను తృప్తి పరిచేందు కేదో చదివేవాణ్ణి. యుద్ధానికి సమయం వచ్చింది. ఇంక ఆగలేను." అతడు ఇంతసేపు మాట్లాడింది ఇది ఒక్క సారి మాత్రమే. ఉపన్యాస మాగిపోయింది.

సరోజినీదేవి ఆమరునాడే వాలంటీరుదళాన్ని ఏర్పాటు చేసింది. ఎక్కడ విదేశీబట్టలు అమ్ముతూవున్నా శాంతంగా, నిర్భయంగా పికెటింగు సాగించమని ఉత్తరువు జారీచేసింది. గన్నోను చూచిన ప్రజ మేమంటే మేమని, చెప్పనవసరంలేకుండానే వాలంటీరుదళంలో చేరినారు.

సరోజినీ దేవిమాత్రము ఆమరునాడే అరెస్టు అయింది.

* * * *

బొంబాయిలో మిల్లుగుడ్డలు దొంగతనంగా లారీలలో పంపే ఒక సేటుఇంటిముందు ఆనాడు సత్యాగ్రహదళం నిలిచింది. దానికి నాయకుడు గన్నో.

లారీనిండా బట్టలు నింపినారు. వాలంటీర్ల దళం వారిని ప్రార్థించింది. కాని, వారు వినలేదు. ఆ యజమానిని ప్రార్థించినాడు గన్నో - ఆయనా వినలేదు. తర్వాత గన్నో లారీడ్రైవరును ప్రార్థించినాడు-అతడూ వినలేదు. అయినా, గన్నోముఖంలో నిరాశ కనబడలేదు.

సత్యాగ్రహం చేస్తా నన్నాడు. వారు లెక్కపెట్ట లేదు. వాలంటీర్లు నిరాశులైనారు. గన్నోకు వెంటనే ఒక ఉపాయం తోచింది. లారీముందుకు నడచివచ్చి అడ్డంగా పడుకున్నాడు. "డ్రైవర్! నీ లారీ నాప్రాణాలు తీసికాని పోగూడదు." అన్నాడు గన్నో. ఆ కర్కశహృదయుడైన డ్రైవరు లారీని స్టార్టుచేసినాడు.

గన్నో లేవలేదు.

గన్నో ఎదమీదుగా లారీ నడిపింపబడింది.

* * * *

బొంబాయిలో బాబూగన్నోకు వీరపూజ జరిగింది. "గన్నోవారం" అని చెప్పి వారంరోజులు ప్రజ లతనికి ఉత్సవములు జరిపినారు.

శ్రీమతి సరోజినీదేవి ఆతర్వాత కొన్నాళ్ళకు బొం బాయి వచ్చింది. సత్యాగ్రహం చేసిన వాలంటీర్ల స్వాగత మందుకొన్నది. కాని, ఆమె ఎవరినో వెదకుతూవుంది.

ఆసమయంలో ఒక ఇల్లాలూ, ఆమెభర్తా సరోజినీ దేవి దర్శనానికి వచ్చారు. ఆమె కొంచెం చిరాకుగా 'ఎవరు మీరా' రన్నది.

"గన్నో తల్లిదండ్రులు" అని వాలంటీర్లు రుద్ధకంఠంతో అన్నారు.

ఆమె కన్నులు విప్పారినవి.

"గన్నో ఏడీ?" అని గంభీరంగా ప్రశ్నించింది. వాలంటీర్లు పూసగ్రుచ్చినట్లు విషయమంతా చెప్పారు. ఆ భార్యాభర్తల శిరస్సులు నిమురుతూ-"గన్నో చావలేదు. అతని త్యాగం భారతయువకులకు మార్గదర్శి కాగలదు. భారతమాతృఋణం తీర్చుకోగలిగిన ధన్యుడు గన్నో. అతన్ని కడుపారాకన్న మీరుకూడా ధన్యులే! మీరు దుఃఖపడవద్దు. గన్నో చావలేదు - చావబోడు. భారతజాతి అతన్ని మరవ''దంటూ ఆనందబాష్పాలు వదలింది సరోజినీదేవి.

నేటికికూడా బొంబాయినగరంలో గన్నోదినం మహావైభవంగా జరుపబడుతుంది. భారత స్వాతంత్య్రోద్యమ చరిత్రలో బాబూ గన్నో అమరజీవి!

# 4. బలిదానము

"నామాటలపై విశ్వాస ముంచి సంతకం పెట్టు. ఇదిగో ఫారము" అని రిక్రూటింగ్ ఆఫీసరు ఒక కాగితం చేతి కందిచ్చాడు. సరళముఖంలో పదను తగ్గింది. ఆమె ఏమో ఆలోచిస్తూన్నది - ఏమేమి విషయాలో భావిస్తూన్నది. మనస్సు కుదుటపడ్డం లేదు. ఆమెముఖభావం చూచి ఆఫీసరు మళ్ళా తన ఉపన్యాసం ప్రారంభించాడు:

"నీ జీవితం వ్యర్థం చేసుకోకు. అంతా మాయ. నీ తండ్రి కాంగ్రెసుహయాములో శాసనసభ్యుడుగా వున్నంత కాలం కాలికి బలపం కట్టుకొని ప్రజలు నీ యింటిచుట్టూ తిరిగారు. అతడు పోవటంతోనే నీ కుటుంబాన్ని తాకి తలచు కొన్నవారు లేరు. అవకాశం జారవిడుచుకున్నావా - నీకు అధోగతే! గత్యంతరం లేదు. చేరు. సంతకం పెట్టు. మరు నాడే ఈ చింపిరిపాతలు పోయి చక్కని డ్రెస్సువస్తుంది. మంచి స్నోలు వ్రాసుకోవచ్చు. ఈ నీచుకంపు వుండదు. ఎటువంటి శృంగారమైనా, ఎటువంటి భోగమైనా కానీ ఖర్చు లేకుండా అనుభవిస్తావు. మరేజాతికైనా ఈ దేశంలో సౌఖ్యపడే యోగ్యత వుందికాని మీ మాలజాతికిమాత్రం లేదు. ఆ గాంధీ మీకు హరిజనులని పేరుపెట్టి, అస్పృశ్యతా నివారణ మనే నినాదాన్ని లేవదీసి, దేవాలయ ప్రవేశం, సాంఘికహక్కులు అనే ఉరికంబంలోకి మిమ్మల్ని లాగు తున్నాడు. ఎందుకు? కాంగ్రెసును బలపరచుకొందుకు. అంత

కాకుంటే మిమ్మల్ని ఉద్ధరిస్తామని కాదు. మా కష్టాలే సఫల్యాలవుతా వచ్చాయి. రెండు సంవత్సరాల్లో దేశంలో కాంగ్రెసుపేరు లేకుండా చేసేందుకు పథకాలు వేస్తున్నారు. రాష్ట్రాల్లో వుంటూన్న కాంగ్రెసు ప్రభుత్వాలను ఒక్క దెబ్బలో వూడగొట్టారు. అమ్మాయి, సరళా! బ్రిటిషు వాళ్ళంటే తెలివిమాలినవా ళ్ళనుకోకు. సూర్యుడు అస్తమించని సామ్రాజ్యాన్ని చేతిలో పెట్టుకొని రాజ్యం ఏలుతున్నారు. ఈ గాంధీకి, ఈ అహింసకు, ఈ సత్యాగ్రహాలకూ వారు లొంగరుగాక లొంగరు. మొన్న చర్చిల్ ఏమన్నాడో తెలుసా? బ్రిటిషు సామ్రాజ్యానికి ఇండియా మూల స్తంభమన్నాడు. ఇండియావారు ఈ యుద్ధంలో తోడ్పడితే ఆ దేశానికి అంతర్జాతీయంగా గొప్ప ప్రఖ్యాతి వస్తుంది, భారతీయులు బ్రిటిషువారి అభిమానాన్ని చూరగొంటారు అని చెప్పాడు. ఆ మాటలు నీ చెవుల్లో గింగురుమనటం లేదూ? ఈ కాగితంలో సంతకం పెట్టు."

సరళముఖంలో ఒక రకమైన అనుకూల పరివర్తనం కలిగింది. ఆ విషయాన్ని ఆఫీసరు గమనించాడు. తన ప్రయత్నం సఫలమౌతుందనే విశ్వాసం కలిగింది. మళ్ళీ ఒక విషపునవ్వు నవ్వి ఇలా మొదలెట్టాడు:

"నీకు పెద్ద పెద్ద దొరసానులతో స్నేహం కలుగుతుంది. యూరోపియన్ దొరలంతా నిన్ను గౌరవిస్తారు. గంటకు ఒక డ్రెస్సు మార్చవచ్చు. కార్లలో స్వేచ్ఛగా తిరగటానికి వీలుంటుంది. అవసరమైతే స్టీమర్లలోనూ,

విమానాల్లోనూ ప్రయాణం చేయిస్తారు. నీ జీవితంలో మరో విధంగా చూడలేని ఇరాణ్, ఇరాక్, జావా, సింగపూర్, బర్మా, ఆఫ్రికా మొదలైన దేశాలన్నీ చూస్తావు. మిలిటరీ ఉద్యోగం అంటే అరచేతిలోని స్వర్గం అనుకో! కోరిన తిండి, కోరిన గుడ్డ, ఏలాంటి సు. . .ఖం కోరినా లోపం లేదు. ఆలోచించు. బ్రిటిషువాళ్ళు కాంగ్రెసును దద్దమ్మను చేసి అధఃపాతాళానికి త్రొక్కేస్తారు. ఈ గాంధీటోపీవాళ్ళకే ముక్తివుంటే నేనింత చదువు చదువుకొన్నవాణ్ణయి దాని లోనే చేరకపోయానా? నేను వకీలుపని చేస్తున్నంతకాలం నెలకు రెండునూర్లు మాత్రమే వచ్చేవి. ఇప్పుడు జీతం, బత్తా కలిసి వేయిరూపాయాలదాకా వస్తాయి. నిజం చెప్తు తున్నాను. సంతకం పెట్టిన మరుక్షణాన్నుండి నీకు రెండు నూర్లు జీతం. నేనింతగా చెప్పుతున్నానని వేసరిక పడకు. ఇదంతా నీ మేలుకోసమే సుమీ! కానీ, సంతకం పెట్టు.”

సరళముఖంలో మంచి అనుకూలభావాలు కనిపించాయి. ఆఫీసరు మళ్లా డబ్బా మొదలుపెట్టాడు:

“ఇదిగో మిలిటరీకి వెళ్ళావంటే నీతండ్రి ఎలెక్షన్లకు చేసిన అప్పులు తీర్చి, నీయింటినీ, ఆ రెండెకరాల పొలాన్నీ బ్రిటిషుప్రభుత్వంవారు కాపాడి నీకే అప్పచెప్పుతారు. నీవు మిలిటరీలో ఉద్యోగం చేస్తూవున్నావంటే, నీబంధువుల పిల్లలెవరైనా వుంటే వాళ్ళకు స్కూలుఫీజు అక్కర లేకుండా, పుస్తకాలు కూడా ప్రభుత్వంవారే ఇచ్చి, ఎంత గొప్ప చదువుకైనా అవకాశం కలిగిస్తారు. కాంగ్రెసునూ, మీతండ్రి

వాంగ దేశాభిమానాన్ని నమ్ముకొని నీజీవితం పాడుచేసుకోకు. నీకు నేడు 'నా' అనేవాళ్ళు లేరు. యుద్ధం తీవ్రం అయ్యేకొద్దీ ధరలు మరీ హెచ్చిపోతాయి. నీవు బ్రతుకనే లేవు. హరిజనులను ఇండియాలో మాలకానైనా ముట్టరు. అటువంటి మీకులాన్ని రక్షించేందుకే బ్రిటిషుప్రభుత్వం మిమ్మల్ని ఉద్యోగాల్లోకి తీసుకొంటూన్నది. ఊఁ, కాగితంపై సంతకం పెట్టు సరళా!"

"సార్! మీరు చెప్పే మాటల్లో అబద్ధం కాని, మోసపుచ్చే ఉద్దేశంకాని లేదుకదా ?"

"అలా దారికి రా. ప్రపంచంలో ఎవడైనా ఒకరినీ, ఇద్దరినీ, పదిమందినీ మోసంచేయగలుగుతాడు. మన మద్రాసురాష్ట్రంలో నేటికి ఇంచుమించు మూడులక్షల మందిని సైన్యంలో చేర్చినాము. వీళ్ళందరూ మోసపోయేవా రేనా ?బి. ఏ. లూ, యం.ఏ. లూ చదివినవాళ్ళున్నారు. ఇంకా గొప్పగొప్ప శాస్త్రవేత్తలు, కోటీశ్వరుళ్ళ కొడుకులు ఉన్నారు. నర్సులుగా చేరేవాళ్ళ కింకా సుఖం. ఆడుతూ పాడుతూఉండవచ్చు.యుద్ధరంగంలోకి వెళ్ళినా మీకు భయం లేదు. మీరుండే స్థలాలు వేరు. మీకు కలిగే సౌకర్యాలు వేరు. సందేహించక ఫారములో వెంటనే సంతకం చేయి. నామాట విను. బ్రిటిషువాళ్ళకు ఓటమి లేదు. వారు ఎత్తుకుపై ఎత్తు వేస్తారు. యుద్ధం ముగిసి నీవు ఈ దేశానికి తిరిగి వచ్చావా – నాల్గువందల జీతంపైన నిన్ను గొప్పఉద్యోగంలోకి తీసుకుంటారు. ఇంతెందుకు, అమ్మాయి! నీవు సంతకం పెట్టిన క్షణంనుండే నీకు శుక్రమహార్దశ అనుకో !"

"సార్! మీమాటలు నమ్మినాను. నా కెవరూ దిక్కులేరు. నేను ఒంటరిగా జీవించటంకూడా ప్రయాసతో కూడిన పని. నాచేతిలో ఒక్క కానీ అయినా లేదు. నిన్నటి దినం నన్ను హాస్టలునుండి తరిమివేశారు. నన్ను రక్షించినా మీరే, నాశనం చేసినా మీరే! ఇదిగో మీమాటలు నమ్మి సంతకంపెట్టుతున్నాను."

ఆఫీసరు సరళతో కాగితంపై సంతకం పెట్టించి, ఖర్చుల కుంచుకోమని నూరురూపాయిల నోటు చేతి కిస్తాడు. సరళకు ఆశ్చర్యం కలుగుతుంది. ఆమె జీవితంలో ఒక్కమారింత డబ్బు తనచేతి కెన్నడూ రాలేదు. సరళను మాంటు రోడ్ రిక్రూటింగ్ ఆఫీసుకు కార్లో తీసుకపొమ్మని జమాను తో చెప్పాడు ఆఫీసరు. సరళ కార్లో కూర్చొని బయలుదేరి వెళ్ళింది.

* * * *

సరళతండ్రిపేరు చెన్నయ్య. హరిజనుడు. అతనికి కర్నూల్లో ఒక చిన్నయిల్లూ, దాని సమీపంలో గల పల్లెటూళ్ళో పది ఎకరాల భూమీ వుండేది. చిన్నతనంలోనే చెన్నయ్యతండ్రి గతించాడు. తల్లి ఆభూమిలో పండిన ధాన్యం గాక కాయకష్టం చేసి పైఖర్చులకు వేరే సంపాదించేది.

గాంధీమహాత్ముడు దేశసంచారం చేస్తూ కర్నూలు వచ్చాడు. పురజనులు ఆయనకు అఖండమైన స్వాగతమిచ్చారు. ఎటుచూచినా మహావైభవంతో పట్టణం కల

కలలాడుతూవుండింది. అప్పుడు చెన్నయ్య ఘోర్తుఘారము చదువుతూండినాడు. మహాత్ముడు తుంగభద్రాతీరంలో ఏర్పాటుచేసిన బహిరంగసభలో ఉపన్యసిస్తూ, ప్రజల్లో హృదయసంచలనం కలిగించే విషయాలు చెప్పాడు. సాంఘిక రాజకీయాల్లో భారతీయు లెలా నడుంకట్టి ముందుకు రావల సిందీ తెలియజేశాడు. పట్టణప్రజల్లో మహాత్ముని వాక్యాలు గట్టిగా నాటుకొన్నై. కాంగ్రెసు సంఘస్థాపన గొప్పగా జరిగింది. పెద్దలంతా దేశంకోసం ధనప్రాణా లర్పించేందుకు కంకణం కట్టుకున్నారు. రోజురోజుకూ భారతరాజకీయాల్లో కలిగే పరివర్తనమూ, కాంగ్రెసు చేస్తూన్న స్వాతంత్ర్యోద్యమకృషీ ప్రతివాణ్ణీ ఆకర్షింపసాగాయి.

ఏ ఋణానుబంధమో చెప్పలేంకాని, ఘోర్తుఘారం చదువుతూన్న ఆ యువకుని హృదయంలో కాంగ్రెసుమీద ప్రేమ గాఢంగా అలముకొన్నది. కాంగ్రెసు ఆఫీసుతరఫున ఉచితంగా ఇచ్చిన రాట్నంపై నూలు తీసి ఖద్దరు ధరింప సాగాడు.

ఆ పట్టణంలో కాంగ్రెసు ఉద్యమాన్ని ఒక బారిష్టరు శ్రద్ధతో నడిపిస్తూండినాడు. ఆయన చెన్నయ్యను చేరదీసి, అతనికి కావలసిన సహాయం చేస్తూ, అతన్ని కాంగ్రెసు ఆఫీసులో ఉద్యోగిగా నియమించి 20 రూ. వేతనం నిర్ణయిం చాడు. చెన్నయ్య రాజకీయాలు ఎప్పటికప్పుడు తృణ్ణంగా తెలుసుకొంటూ, మంచి రాజకీయగ్రంథాలు చదివి, విజ్ఞా నం సంపాదించా లనుకోవటమే ఆయనతలంపు. కర్నూలు పౌరులు అతనిపట్ల ఎంతో అభిమానం చూపేవారు. వేదిక

లపై కెక్కి ఉపన్యాసా లివ్వటం అతనికి బాగా అలవా టయింది. హరిజనుల అభిమానపాత్రుడైనాడు. పెద్దలు చెన్నయ్యకు వివాహం చేశారు. కొంతకాలానికి సరళ పుట్టింది. మరీ సంతానం లేదు.

ఇలా కాలం గడుపుతూండగా రెండవ పర్యాయం గాంధీమహాత్ముడు కర్నూలు కేతెంచాడు. పట్టణంలో ఆనందంతోపాటు జాతీయభావం వెల్లివిరిసింది. బ్రహ్మాండ మైన సమావేశంలో మహాత్ముడు చెన్నయ్య చేస్తూన్న సేవనూ, పౌరులతనిపై వర్షిస్తూన్న కరుణనూ కొనియా డాడు. దాంతో చెన్నయ్య దేశసేవలో మరోఅడుగు ముం దుకువేసి ఉప్పుసత్యాగ్రహంలో కారాగృహవాసంకూడా అనుభవించాడు.

ఆతర్వాత రాష్ట్రశాసనసభల ఎన్నికలు వచ్చాయి. దేశమంతటా కాంగ్రెసు అభ్యర్థులు ఎన్నికల్లో పోటీ చేస్తు న్నారు. కర్నూలు నియోజకవర్గానికి బారిస్టరుగారూ, హరిజననియోజకవర్గానికి చెన్నయ్యా కాంగ్రెసుఅభ్యర్థు లుగా పోటీచేసి ఎన్నుకోబడ్డారు.

చెన్నయ్యకిప్పుడు పెద్దపెద్దవారితో పరిచయ మేర్ప డింది. మనిషి స్వార్థపరుడు కాదు. ఎలెక్షన్ల దెబ్బలోనూ, కాంగ్రెసు సమావేశాల రాకపోకలకూ చాలాడబ్బు వ్యయ మైంది. ఎనిమిది ఎకరాల భూమీ అమ్మక తప్పిందికాదు. స్కూలుఫైనలు కాగానే బిడ్డను మద్రాసులో నర్సుట్రెయి నింగుకు పంపించాడు. దారిద్ర్యం పీడిస్తూన్నది కదా మరి!

కొంతమంది పెద్దలను చేయిచాచి అడిగి చందాలు ఏర్పాటు చేశాడు. ఆ చందాలు పొదుపుగా వాడుకొని చదువుతూ వున్నది సరళ.

దైవగతిని కనిపెట్టలేము. కర్నూల్లో కలరా చుట్టు ముట్టుకున్నది. హరిజనవాడ కలముకొన్నది - చెన్నయ్య కలరా తగిలినవారికి సహాయం చేయసాగాడు. సరళ దౌర్భాగ్యంవల్లనో, కర్నూలు దురదృష్టంవల్లనో చెన్నయ్య కూ, అతని భార్యకూ ఒకేమారు కలరా సోకింది. ఆ మహా మారి పూరకపోతుందా? ఆ భార్యాభర్తలను పొట్టపెట్టు కొన్నది. ఇప్పుడు సరళ ఏకాకిని.

ఎటు చూచినా ఆశ్రయం లేకపోవటంతో సరళకు గుండె చెదరింది. బారిస్టరుగారు సహాయం చేస్తూ వచ్చారు. కాంగ్రెసుప్రభుత్వాలు యుద్ధమూలకంగా తొలగిపోయాయి. యుద్ధానికి వ్యతిరేకంగా కాంగ్రెసు వ్యష్టిసత్యాగ్రహం సాగించింది. ముఖ్యమైన కాంగ్రెసువాదు లందరూ జైళ్ళలో మగ్గసాగారు. సరళ ఇప్పు డెవరివద్దా సహాయంపొందలేక, దినదినగండంతో కాలం గడిపి ఎట్లో పూర్తిచేసుకొన్నది పరీక్షలు.

తన తండ్రికి కావలసినవా రెవరూ లేరు. ఉద్యోగా నికై రెండుమూడు రోజులు గట్టిగా ప్రయత్నిస్తామా అంటే తనకు చేతిలో కానీ లేదు. గుడ్డలుకూడా చాలావరకు చిరిగిపోయినాయి. హాస్టలు మూసివేశారు. తనతో చదివే పిల్లలంతా ఎవరి గ్రామానికి వారు వెళ్ళారు. పాపం! సరళ ఎక్కడికి పోతుంది? ఎక్కడికి పోతే ఎవరున్నారు?

ఆ రోజు జనరల్ ఆస్పత్రిలో వున్న ఒక రోగికి శాస్త్ర పరిచర్య చేసి రెండు రూపాయిలు సంపాదించుకొని కడుపు నింపుకొన్నది. ఆమెకు ప్రతిక్షణమూ మరుక్షణానికి సంబంధించిన సమస్యే - కలవరపాటే! యుద్ధము సాగుతూన్న విషయమూ, ఆ యుద్ధానికి మంచి జీతాలమీద నర్సులు వెళ్ళుతూన్న విషయమూ ఆమెకు తెలుసు. భారతదేశాన్ని ఈ యుద్ధంలోకి అనవసరంగా దింపారనే ఆందోళన కాంగ్రెసు చేసిందికూడా ఆమెకు జ్ఞాపకమే! భారతదేశానికి ఈ యుద్ధకార్యకలాపాలు విద్రోహకరమైనవే ననే విషయం సరళకు తెలిసినప్పటికీ తన జీవితసమస్యను తీర్చే విధానమేమీ మనస్సుకు తట్టలేదు. ఎన్నో విధాలుగా ఆలోచిస్తూ ఆమె సెంట్రలుస్టేషనువైపు నడిచి వచ్చింది.

సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు. తల దాచుకొనేందుకైనా స్థలం లేదు. వెళ్ళి స్టేషనులో బెంచీపై కూర్చొని సుదీర్ఘంగా ఆలోచింపసాగింది. ఎంత ఆలోచించినా మరోవిధానం అగుపించలేదు. సరే, నిర్ధారణ చేసుకున్నది.

రిక్రూటింగ్ ఆఫీసులో అడుగుపెట్టగానే ఆ ప్రబుద్ధుడు స్వాగతమిచ్చి ఆమెనుండి తెలుసుకోవలసిన విషయమంతా తెలుసుకొన్నాడు. రిక్రూటింగ్ ఆఫీసర్ల మామూలు ధోరణిలోనే ఎన్నో ఎత్తులు వేశాడు. కడకు పాచిక పారింది. ఇప్పుడు ఆమె భారతీయ సైన్యంలో ఉద్యోగిని.

* * * * *

అగ్రిమెంటు వ్రాయించుకొని సరళకు మిలిటరీదుస్తు లిచ్చారు. ఆమె మిలిటరీక్యాంపులో నివసించేందుకు వసతి చూపించారు.

సరళహృదయం తూటుపడ్డ ఓడలాగా దుఃఖభారం తో నిమిషనిమిషానికీ బరువెక్కుతూంది. ఆమెకు ఈ బాహ్య ప్రపంచంలో కనుపిస్తూండిన సౌజన్యతా, సుహృద్భావం ఆ మిలిటరీక్యాంపులో కనిపించటం లేదు. అసలే రాక్షసత్వం తో మునిగి తేలుతూన్న ఆ "మిలిటరీ యోధులకు" ఆడు వారిని చూస్తే కొరకొర. అలాంటి స్థితిలో ఆమె బహిఃప్రపం చంలో కనిపించే దయాద్రృక్కులు కాని, మానవుల్లో వుండే నైతిక సంపత్తిని కాని ఆ రాక్షసుల్లో చూడలేక పోయింది. ప్రతివాడూ ఆమెను కోరచూపుల్తో బాధించడమే. ప్రతి వాడూ ఆమెను అమాంతంగా సొరసుక పోవడమే. ఆమె ఇదివరకు ఒక దారిద్ర్యంతో మాత్రమే బాధపడిందికాని, హృదయంతో ఇలా బాధపడి ఎరుగదు. ఆమెకు మగవా రంటే ఎంతో సిగ్గు. అలాంటి మనిషి సంకట పరిస్థితుల్లో చిక్కుబడిపోయింది.

ఒక నెలకాలము మిలిటరీ ట్రెయినింగుఇచ్చి ఆమెను బెంగుళూరుకు పంపారు. ఆ మిలిటరీ ఆస్పత్రిలో క్షతగా త్రులకు పరిచర్యచేయటమే ఆమెపని. సరళ ఎంత మెలకు వతో ప్రవర్తించినా వారి రాక్షసత్వాన్ని జయించలేక పోయింది. ఆ కర్కశశరీరాల్ని తగిలి నెమ్మదిగా పరిచర్యలు చేసేది. ఆ మిలిటరీవాళ్ళు సరళ కుసుమకోమల హస్తస్పర్శ తో హృదయాలలో ఎక్కువగా బాధపడేవారు.

ఇలా కొంతకాలం గడిచింది. రంగూను ఒక్క దెబ్బలో జపాన్ చేత బడింది. రంగూనునుండి క్షతగాత్రులను ఒక ఓడ మద్రాసుకు చేర్చింది. మద్రాసులో ఆ వచ్చిన జనానికంతా వైద్యసౌకర్యాలు కలిగించలేక వచ్చినవారిలో కొంతమందిని బెంగుళూరు పంపారు. ఒక గదిలో ముగ్గురు క్షతగాత్రుల నుంచి వారికి పరిచర్య చేసే నిమిత్తం సరళను నియమించారు. ఆమె ఎంతో నేర్పుతో వారికి పరిచర్య చేస్తూ వచ్చింది. కొంతకాలానికి వారి గాయాలు మాన్పుకు వచ్చినాయి. వా రటూ ఇటూ తిరుగగల్గుతున్నారు.

ఒకనాటి సాయంత్రం సరళ శుభ్రమైన దుస్తులతో ఆ గదిలోకి ప్రవేశించి వారి కాహారం వగైరా ఇచ్చింది. కాని, ఆమె కానాడు వారిలో ఏదోఒక క్రొత్త వింతప్రవర్తన కనిపించింది. కాని సరళ లక్ష్యంచేయలేదు. ఆహార మివ్వటం పూర్తికాగానే ఆమె రోగుల మానసికవికాసానికి గాను ఏర్పాటుచేయబడ్డ రేడియోలో యూరోపియన్ సంగీతం పెట్టి వింటూ కూర్చొన్నది.

ఆ సంగీతంలో శృంగారం చిందులు వేస్తుంటే రోగులు హృదయాలతో గంతులు వేస్తూన్నారు. సరళ ఏదో తన సోదిని తలచుకొని తలచుకొని ఆ సంగీతాన్ని వినీవిననట్టుగా ఏమో ఆలోచిస్తూన్నది. ఆ సంగీతంరుచి మెక్కువయ్యేకొద్దీ సిపాయీల హృదయంలో శృంగారరసం పొంగి పొరలుతూన్నది. సరళ వారిదగ్గర కాఫీగ్లాసు పెట్టి వెళ్ళిపోదామని ప్రయత్నిస్తూండగా ఒకడు వచ్చి టకాలున చేయి పట్టుకొన్నాడు. ఆమెకు హడలెత్తిపోయింది. మొదటి

వాడు చేయిపట్టుకోవటం చూచి, రెండో వాడు వచ్చి ఆమె నెత్తినున్న టోపీ తీసి జడ పట్టుకున్నాడు. అవకాశం మునిగిపోతుందని మూడో వాడుకూడా లేచివచ్చి వారితో కలుసుకొన్నాడు.

ఒక క్షణంపాటు సరళకు దిక్కుతోచలేదు. ఆమె శరీరాన్ని కత్తులతో పొడిచినట్లయింది. తుపాకిగుండ్లతో కాల్చినట్లయింది. రంపంతో కోసిన ట్లగుపించింది. ఆమె ఎన్నడూ కనీ, వినీ, తలచీ ఎరుగని సంఘటన ఇది. గుండెలు దడదడ కొట్టుకున్నాయి. తల తిరిగింది. శరీర మమూంతం వణకటం మొదలుపెట్టింది. నోటినుండి మాట పెకలిరాలేదు. ఆ సిపాయీలు తెల నిమురటానికి ప్రారంభించారు. వాళ్ళ చేతులు తగులుతూంటే ఆమెకు శరీరం భగ్గుమంటోంది. తను వాళ్ళను బలంతో ఎదిరించలేదు. మాటల్తో అర్థం చేసుకోలేని పశువులు వారు. ఇక ఆమె కేటూ దిక్కు తోచక "నన్ను వదిలిపెట్టండి. ఇలా తెలిసివుంటే నే నీఉద్యోగంలోకే వచ్చేదాన్ని కాను. మీలో మానవత్వం నశించింది. మీరు పశువులు. ఒక ఆడుదాన్నిలా బలాత్కరించటం రాక్షసత్వం. ఛీ, వదలండి" అన్నది. అసలే మత్తెక్కిన ఆ క్రూరులు మాట్లాడకుండా ఆమెనోరు కట్టారు....

* * * *

"సార్ ! నా కీఉద్యోగం అక్కరలేదు. నన్ను వదిలించండి. వెళ్ళుతాను." అని వెక్కి వెక్కి ఏడుస్తూ అడిగింది.

"ఎందుకు?" అన్నాడు ఆఫీసరు.

"ఈ రాక్షసుల్లో నే నింక ఒక్కనిమిషమైనా తిరుగ లేను. నా కీ సంగతులన్నీ తెలిసివుంటే ఆ రిక్రూటింగ్ ఆఫీసులో అడుగుపెట్టేదాన్నే కాదు. నేను పుస్తకాల్లో రష్యా రెడ్ ఆర్మీ మొదలైనవాటిని గురించి చదివి అలాంటి ఆదర్శాల్తోనే భారతసైన్యం నిర్మింపబడివుంటుం దనుకున్నాను. నీతినియమాలు లేక తమ సంఘానికే ద్రోహం చేస్తూన్న ఈ రాక్షససైన్యంతో కలిసిమెలసి వుండటం చేతకాని పని. నా కీ జీవితం అక్కరలేదు." అని తన ఆక్రోశమంతా వెళ్ళగ్రక్కింది సరళ.

"ఇది మిలిటరీ. మాట కెదురాడకూడదు. మేము అగ్నిలో దూకమంటే దూకవలసిందే. ఎవరైనా సరే ఎదురుమాట చెప్పారా, వెంటనే తుపాకిగుండుకు కాచుకో వలసి వస్తుంది. జాగ్రత్త! అసలు నీ కష్ట మేమిటో చెప్పు. వీలుంటే తగిన అనుకూలాలు కలిగిస్తాను" అన్నాడు ఆఫీసరు.

"నన్ను మీరు వదిలిపెట్టినట్లయితే తుపాకిగుండుతో కాల్చిచంపినా నాకు సంతోషమే! అవినీతి, కర్కశత్వం కల ఈ మనుష్యుల్లో నే నొక్క నిమిషమైనా నిలువలేను. పరిచర్య చేయించుకొంటూన్న ఆ ముగ్గురూ నన్ను బలాత్కరించి నాశీలం పాడుచేశారు. నాల్గురోజులు ఎంతో కష్టపడి డాక్టరు నన్ను బ్రతికించాడు. పవిత్రమైన నాశీలం ఈ మిలిటరీ ఉద్యోగంలో చేరటంవల్ల నాశనమైపోయింది. నాకీ ఉద్యోగంతో పనిలేదు." అని వాపోయింది.

"ఓస్! ఇందుకేనా ఇంత దుఃఖం? అది మామూలే. మా ఇంగ్లండులో సైనికుల్ని సంతోషపరచాలని ఆడువాళ్ళు తమకై తామే మిలిటరీ క్యాంపుల్లోకి వస్తారు. ఈ పాటి పనికైతే నీ వేమీ చింతపడ నవసరంలేదు. నిన్ను ఉద్యోగంనుండి వదిలించటానికి చట్టంఒప్పుకోదు. నీవు పారిపోవటానికి ప్రయత్నించినావా, మరణశిక్ష తప్పదు." అని చెప్పి సరళను బయటికి పంపించాడు.

సరళమనస్సులో భూకంపం చెలరేగింది. ఆమె కేమీ గత్యంతరం కనిపించలేదు. డాక్టరు పదిహేను రోజులు విశ్రాంతి తీసుకొనే అవకాశం కలిగించాడు. ఆ గడువు తీరే లోపుగా ఆమె ఎలాగైనా ఈ నరకకూపంనుండి తప్పించుకపోవాలని నిర్ణయించుకుంది.

సరళకు వేయి త్రాచుపాములు శరీరమ్మీద ప్రాకినట్లుగా వుంది. ఆ రిక్రూటింగ్ ఆఫీసరు చెప్పిన మాటలు నమ్మి తాను ఈ నరకంలో ప్రవేశించింది. దీనినుండి తప్పించుకోవాలని ప్రయత్నిస్తూన్నది క్షణక్షణానికీ. కాని మార్గాంతరం మాత్రం దొరకలేదు. ఆ జీతండబ్బులు చేతబట్టుకొని బెంగుళూరువీధుల్లో తిరుగుతూ ఏవో పుస్తకాలు కొన్నది. ఆరోజు "ఆంధ్రపత్రిక"లో ఒక పెద్ద శీర్షిక కనిపించింది. దానిలోని విషయము: బొంబాయి వీధిలో పోతూండే ఒక సంపన్నస్త్రీని బ్రిటిషుసైనికులు అవమానపరచటాన్నిగూర్చి మహాత్మాగాంధీ తీవ్రంగా నిరసించటం. ఇది చదువుకొనేసరికి సరళగుండెల్లో రాయి పడినట్లయింది. అప్పుడు గ్రహించగలిగింది సైనికుల పశుత్వంయొక్క పర

మావధి. ఇంక ఈ మిలిటరీ కూపంలోనుండి బయటపడక తప్పదనే స్థిరనిర్ణయానికి వచ్చింది సరళ.

అది పదుమూడవ రోజు. పదిహేనవరోజున ఏ మళయాళదేశానికో వెళ్ళి ప్రచ్ఛన్నంగా జీవితం గడుపుదామనుకొని తన మిలిటరీ బసకు వెళ్ళి అవసరమైన వస్తువులు తెచ్చుకుందా మనుకుంది. ఇది ఇలా వుండగా ఆనాడే మిలిటరీ ఆఫీసరుకు, వెంటనే ఒక సైద్యదళాన్ని సింగపూరు పంపమని, భారతసర్వసేనాని టెలిఫోను వార్త! ఆనాటికి బర్మా పతనమైంది. సమీపప్రాచ్యంలోనూ, పసిఫిక్ రంగంలోనూ యుద్ధతీవ్రత హెచ్చిపోయింది. జపాన్ విజయపరంపరకు అమెరికా, ఇంగ్లండు దేశాలు తత్తరపడసాగాయి. సింగపూరుకు ఏక్షణంలోనైనా ప్రమాదం సంభవించవచ్చునని మిలిటరీవేత్తల అభిప్రాయము. అందువలన సైనిక సమీకరణ చురుకుగా సాగుతున్నది.

అక్కడ సరళ తన గదిలో వస్తువులను చక్కబెట్టుకొంటూండగా ఆఫీసరు ఆమెగదిలోకివచ్చి "నీ సెలవును రద్దు చేసినాము. నీవు సిద్ధంగా వున్న విమానంలో వెంటనే బయలుదేరి సింగపూరు పోవాలి." అని ఆజ్ఞాపించి, ఇద్దరు సైనికులతో ఆమెను విమాన మెక్కించమని చెప్పి వెళ్ళిపోయాడు. సరళప్రయత్నం భగ్నమైంది. సైనికులు యమభటుల్లాగా నిలుచున్నారు. ఆమె బయలు దేరక తప్పిందికాదు. సామాను సర్దుకొని బయటికివచ్చి తనకోసం సిద్ధంగా వున్న లారీలో కూర్చొని విమానందగ్గరకు వెళ్ళింది. విమానం మెట్లు ఎక్కేటప్పుడు హఠాత్తుగా ఆమెకు ఇక మాతృదేశం

చూచే అదృష్టమున్నదో, లేదో అనే చింత కలిగింది. నాలుగు కన్నీళ్ళతో గౌరవించింది భారతభూమిని. బరువౌతూన్న నిరాశతో ఆ పరిసరప్రాంతాన్ని ఒకమారు ఎగాదిగాచూచి తన స్థానంలో కూర్చొని కన్నులు మూసింది.

*    *    *    *

నేడు మిలిటరీకిగాను ప్రత్యేకంగా నిర్మింపబడ్డ 'ఇండియన్ జనరల్ హాస్పిటల్' సింగపూర్ శాఖలో ఆమెకు ఉద్యోగము. ఆ హాస్పిటల్లో వున్న క్షతగాత్రులంతా అమెరికాదేశంలో పశువుల్లా భావించబడే నీగ్రో సైనికులు. కర్కశ శరీరులు. వాళ్ళని అమెరికాదేశవాసులు మహా నీచంగా చూట్టం మామూలు. అలాంటివాళ్ళకు సరళ వైద్య సేవ చేయవలసి వచ్చింది. ఆమెకు రాత్రింబగళ్ళూ వారి సేవ చేయటం తప్ప మరో కార్యం లేదు – చేయనీరు. ఆ రొంపిలోనే ప్రొద్దస్తమానం గడుపవలసి వచ్చింది.

రాత్రిళ్ళపూట సైనికులు తప్పత్రాగి స్మృతి లేకుండా పడుతారు. వారికి మానసికోత్సాహం కలిగించేందుకుగాను యూరోపియన్ సంగీతం రేడియోలో పెట్టటం అలవాటు. ఒకనాడు పద్ధతిప్రకారమే యూరోపియన్ సంగీతం పెట్టింది సరళ. తాను ఒక పుస్తకం తీసుకొని దీపంముందు కూర్చొని చదువుతూండింది. ఆ సంగీతం రానురాను రణగొణధ్వనిలా మారిమారి, తుదకొక చక్కని గీతం వచ్చింది. ఆ గీతంలోని భావం నీగ్రోల నిందన. మత్తుతో పడివున్న ఆ సైనికులు కండ్లు తెరచి, చెవులు నిక్క పెట్టి వినేసరికి అది తమజాతికి

ఆపాదించే గీతమని గుర్తించారు. సరళకుమాత్రం ఇదేమీ అర్థం కాలేదు. తన చేతిలో వున్న 'Case of India' అనే గ్రంథం చదువుతూ కన్నీళ్ళు కారుస్తూ బాధపడుతూన్నది. ఇలా ఆమె పరధ్యానంగా వుండగా మత్తునుండి తేరుకున్న ఇద్దరు సైనికులు మెల్లిగా వచ్చి 'ఫడీలు' మని ఆ రేడియోను బూటుకాలితో కొట్టారు. ఆ శబ్దానికి సరళ ఉలిక్కిపడి చూచింది. రేడియో ముక్కచెక్కలై పడివుంది. ఆ నీగ్రోలు కంఠస్వరం చేసి ఆమెవైపే నడిచివస్తూన్నారు. సరళకు గుండె గుభేలు మన్నది. రావటంరావటమే అందులో ఒకడు సరళను బూటుకాలితో నెత్తిపై తన్నాడు. ఆమె పంచప్రాణాలూ పైకి లేచిపోయాయి. చేతిలో వున్న పుస్తకాన్ని ఇంకొకడు ఎగరతన్నాడు. మొదటివాడు "నీచపు ముండా! మాజాతిని ఎత్తిపొడిచే గీతం పెట్టి నీవు ఆనందిస్తూన్నావా?" అని కోరచూపు చూచి చురచుర వెళ్ళిపోయాడు.

సరళ కొంతసేపటికి తెప్పరిల్లుకొన్నది. ఆమె జీవితం దుర్భరమై పోయింది. ఏకధారగా కురిపిస్తోంది కన్నీళ్ళు.

ఉదయమయ్యేసరికి ఒక డాక్టరు సరళ వుంటూన్న చోటికి వచ్చాడు. 'Case of India' చిందర వందరగా ఒకమూల పడిఉండటం గమనించాడు. అతనికి ఆశ్చర్యమైంది. వెంటనే అధికారులకు తెలియజేశాడు. ఆ పుస్తకంపై ఇండియాలో నిషేధం వుండింది. దాన్ని సరళ బెంగుళూరులో ప్రాత పుస్తకాలమ్మే అంగట్లో కొన్నది. ఆమెకీగొడవంతా తెలియదు. "సరళకు జాతీయభావా లున్నాయి. అలాంటి ఉద్యోగిని సైన్యంలో వుండటం ప్రమాదము. వెం

టనే ఆమెను నిర్బంధించమని ఉత్తర్వులు జారీచేశారు—
ఆమె నిర్బంధింప బడింది.

* * * *

హఠాత్తుగా సింగపూరుపై జపాన్ దాడిచేసింది.
ఉన్నదున్నట్లు ఒక్కరాత్రి జపాన్ సేనలు సింగపూరులోకి
చొచ్చుకొని వచ్చాయి. కొన్నిగంటల యుద్ధంతో జపాన్
వారు సింగపూరును పట్టుకున్నారు. ఇండియా, అమెరికా
సైన్యాలు జపాన్ వారి బందీ లయ్యారు. సింగపూరు పతన
వార్త ప్రపంచానికి కలవరపాటు కలిగించింది. నేడు సరళకు
ఇండియాప్రభుత్వపు చెరతప్పి జపాన్ వారి చెరప్రాప్తించింది.

* * * *

రాజవీథులన్నీ అలంకరించారు. సింగపూరు పట్టణం
లో విపరీతమైన కోలాహలం బయలుదేరింది. చెరలోపెట్ట
బడిన సైనికులు, ప్రజాసామాన్యము ఒక్కచోట సమా
వేశపరుపబడ్డారు. జపాన్ సైనికులు సైనికవిన్యాసం జరుప
టంతోనే ఒక బ్రహ్మాండమైన వేదికమీద సమావేశం
ప్రారంభమైంది. జపాన్ సైనికాధికారులు తమ సైనికులు
సింగపూరు దాడిలో చూపిన సాహసపరాక్రమాల్ని కొని
యాడుతూ మాట్లాడారు. సైనికులు మరోమారు వీరావే
శంతో ఉప్పొంగేలాగా జయజయధ్వానాలు చేయబడ్డాయి.

ఆజానుబాహువు, విశాలమైన నుదురు, వీరశృంగార
రసాలు తొణికిసలాడే కనులు, కార్యదీక్ష, గంభీరభావమూ
ముఖంలో వ్యక్తమౌతూన్న ఒక మహావ్యక్తి వేదికపైకి

వచ్చి నిలుచున్నాడు. సభలో కలకల మణిగింది. ఎవరా ఈ నూతనవ్యక్తి అని ప్రతివాడూ తీవ్రంగానే ఆలోచిస్తున్నాడు.

ఒక బెంగాల్ సైనికుడు ఆ నూతనవ్యక్తిని గుర్తించాడు. అతనిలో ఉత్సాహం పొంగిపోయింది. ఆ ఉత్సాహాన్ని ఆపుకోలేనివాడై, సభాక్రమశిక్షణకు వ్యతిరేకంగా లేచి నిలుచొని "సుభాస్ చంద్రబోస్‌కు...జై! జై!!" అని నినాదాలు చేసేటప్పటికి సభంతా జయజయధ్వానాలతో మారుమ్రోగింది. భారత సైనికుల్లో మ్రోడువారిపోయిన జాతీయభావం చిగిర్చింది.

సరళ అదివరకు తాను పడ్డ కష్టాలన్నీ మరచిపోయి ఆ దివ్యమంగళవిగ్రహాన్ని చూస్తూ పరవశురాలైంది. తన కష్టా లింక గట్టెక్కుతాయనీ, తన దేశాని కింక ఏమైనా సేవ చేయగలననీ ఆమెఆశ. ఆ ఆశ క్షణక్షణానికీ శతాధికమాతూ హృదయంలో నా దేశం, నా జాతి, నా రాజ్యం అనే భావాల్ని ఉదయింపజేస్తూ వచ్చింది. సరళ తన నిరాశాపూరితమైన జీవితంలోకెల్లా ఆనందపరమావధి నందుకొన్న దానాడు మాత్రమే!

ఆ చెలరేగిన కలకలం సైనికుల సర్దుబాటువల్ల తగ్గింది. సభ్యులంతా సుభాస్‌బాబువైపు చూస్తూ, చెవులు నిక్కపొడుచుకొని ఆయనవచనామృతం తనివితీరా త్రాగి తరిస్తామనుకొని నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"జై **హింద్**! - భారతసోదరసోదరీమణులారా! మిమ్మల్ని కలుసుకొనే భాగ్యం నాకు కలిగించిన ఆ భగవంతునికి ధన్యవాదాలు. మీరంతా నేటినుండి స్వతంత్రభారత

పౌరులైనారు. ఏ దాస్యంతోనైతే మన మింతకాలం క్రుంగి కృశించిపోయామో ఆ దాస్యం నేటితో మనకు వదిలి పోయింది. మన తోడిసోదరుల దాస్యాన్నికూడా మనం తీర్చేందుకు కంకణం కట్టుకోవాలి. స్వాతంత్ర్యం మానవుని జన్మహక్కు. మన జన్మహక్కయిన స్వాతంత్ర్యం లేకుండా జీవించేందుకంటే మరణించటం మేలు. తెల్లపురుగు భారతదేశంలో వుండకూడదు. భారతజాతి పేరెన్నికగన్న జాతి. అట్టి మన జాతికి పారతంత్ర్యకళంకాన్ని పోగొట్టేందుకు కాంగ్రెసుసంస్థ దేశంలో ఎన్నో ఉద్యమాలు లేవదీసి ప్రతిభారతీయునికీ స్వాతంత్ర్యాసక్తి కలిగించింది. అహింసాత్మకంగా బ్రిటిషువారిని జయిస్తామనీ, దేశానికి స్వాతంత్ర్యం సంపాదిస్తామనీ అనే కాంగ్రెసుదృక్పథంలో నాకు నమ్మకం లేదు. కత్తికి కత్తి నడ్డుపెట్టాలేకాని. కత్తికి తల నడ్డుపెట్టలేము. కాబట్టి జర్మనీ, జపాన్ దేశాల సహాయంతో మన దాస్యాన్ని వదిలించుకొందాం-లేదా, వీరమరణం పొందుదాం! ఆ మహాసేనకు మీరంతా ఆత్మార్పణం చేయాలి! ఈనాడే ఇక్కడ ఆజాద్ హింద్ ప్రభుత్వాన్ని స్థాపింతాము. మీరంతా ఆజాద్ హింద్ సైన్యంలో చేరండి. మన జాతికంతా స్వాతంత్ర్యాన్ని ప్రసాదించండి. నేను మీ కేమీ ఇవ్వలేను. నేను స్వాతంత్ర్యం ఇస్తాను - మీరు రక్తం ఇవ్వండి. ఈ స్వాతంత్ర్య సమరానికి స్త్రీలు-పురుషులు, ధనికులు-దరిద్రులు అందరూ తోడ్పడాలి. ఎవరిచేతనైన సహాయం వారు చేయక తప్పదు. ధనికులు తమ ధనాన్నంతా సమర్పించాలి.

బ్రిటిషు ప్రభుత్వాన్ని భారతదేశంనుండి కూకటివ్రేళ్ళతో పెకలించివేసిననాడే మన దీక్ష సమాప్తమౌతుంది. అంత వరకు మన ఆశయసిద్ధికోసం ఎంతటి త్యాగాలకైనా వెను దీయకూడదు. ఎవరెవరు ఏఏ విధంగా తోడ్పడగలుగు తారో ఆఆవిధంగా తోడ్పడేందుకు ముందుకు రండి! జై హింద్!'' అంటూ ఉపన్యాసం ముగించాడు.

* * * *

ఆజాద్‌హింద్ ప్రభుత్వంలో సింగపూరునందున్న భారతసైనికు లందరూ చేరారు. స్త్రీలందరూ ఉత్సాహంతో సైనికశిక్షణ పొందుతూ, తమ దేశంకోసం బలి దానానికి సిద్ధమయ్యారు. ఆజాద్‌హింద్ ప్రభుత్వకార్యా లయం విధివిరామం లేకుండా పనిచేయసాగింది. దాని శాఖలు బర్మా, మలయా, జావా మొదలగు దేశాల్లో స్థాపింపబడ్డాయి. అక్కడక్కడి భారతీయులు తమ దేశ దాస్యవిముక్తికోసం ప్రతిజ్ఞలు పూనిఫౌజులో చేరుతూన్నారు.

సరళ స్త్రీల మిలిటరీదళంలో చేరి శిక్షణ పొందింది. స్త్రీల శాఖకు కెప్టెన్ లక్ష్మి నాయకత్వం. పురుషులకంటే స్త్రీలలో కనబడుతూన్న దీక్షాపటిమ కెంతో సంతోష పడ్డాడు నేతాజీ.

జపాన్ ఆక్రమిత దేశాల్లోని భారత ధనికులు తమ తమ ఐశ్వర్యాన్నంతా బోస్‌చరణసన్నిధిని పెట్టి దేశ భక్తిని ప్రదర్శించారు. ఆ ప్రాంతాల్లోని ప్రతిభారతీయుని లోనూ దేశభక్తి, జాతీయభావం పెంపొందించి, వారిని ఎంతటి అఖండత్యాగాలకైనా సిద్ధపడేట్టు కొన్ని మాసాలు

పర్యటించి ప్రబోధించాడు నేతాజీ. ఆ అఖండోత్సాహానికి ముగ్ధుడై కార్యరంగంలో ప్రవేశించేందు కింక ఆలస్యం చేయనక్కర లేదనుకొని రణభేరి మ్రోగించాడు.

సరళ కిప్పటి జీవిత మెంతో సుఖప్రదంగా వున్నది. పాత కష్టాలన్నీ మరచిపోయింది. నేడామె కెటుచూచినా ఆనందసామ్రాజ్యమే! తన కిదివరలో ప్రతిసైనికుడూ మహాపాపి - రాక్షసుడులాగా కనిపించేవాడు. నేడు ప్రతి సైనికుడూ మహాపూజ్యుడు - దేశభక్తుడులాగా కనిపిస్తున్నాడు. జాతి, మత, కులతత్వాల కందులో ప్రవేశం లేదు. ప్రతివ్యక్తీ ఎంతో బాధ్యతతో ప్రవర్తిస్తూ ధర్మనిర్వహణంలో అతి జాగ్రత్తగా మెలగుతూండటాన్ని చూచి సరళ ఆశ్చర్యపడేది. దీనికి కారణ మేమిటి? కొంతకాలం ఆలోచించింది - ఎంతోకాలం చర్చించుకొన్నది. చివరికి అర్థమైంది. తాను పూర్వం చూచిన సైనికులు పొట్టకూటికై దేశద్రోహానికి ఒడిగట్టిన పశుతుల్యులు. నేడు చూస్తున్న సైనికులు స్వార్థరహితులై దేశస్వాతంత్ర్యానికి పూనుకున్న ఆదర్శజీవులు. నిజంగా ఆ స్వేచ్ఛావాతావరణం, ఆ సౌభ్రాతృత్వం, ఆ జాతీయభావం ఆమెహృదయాని కెంతో హాయిని కలిగించాయి.

స్త్రీలు యుద్ధభూమికి రానక్కర లేదని సుభాస్ చంద్ర బోస్ ఆజ్ఞాపించాడు. స్త్రీలదళం సైనికస్థావరాల్లోనే వుండి కావలసిన సరఫరాలు పంపుతూ, క్షతగాత్రులకు వైద్యసహాయం వగైరాలు చేస్తూండాలని చెప్పటంవల్ల స్త్రీలలో అసంతృప్తి బయలు దేరింది. సరళ కదివరకున్న ఉత్సాహం

మటుమాయమైందొక్క దెబ్బలో. ఆమె ఆపుకోలేక పోయింది రణోద్రేకాన్ని. స్త్రీలనందరినీ కట్టుకట్టి, మనం కూడా రణరంగంలో కురికి పురుషులకన్నా ఎక్కువగా సాహస పరాక్రమాలు ప్రదర్శించాలని ప్రబోధించింది. కెప్టెన్ లక్ష్మితో కలిసి, నేతాజీని దర్శించి స్త్రీల తరఫున గట్టిగా వాదించింది. ఆ వాదమంతా శ్రద్ధగా విని ఒక్క నవ్వు నవ్వుతూ "అమ్మా! మీరు తగిన ఉత్సాహాన్ని కలిగించి పురుషుల్ని రణరంగంలోకి పంపాలి. మీరు యుద్ధంచేసే ఆ శుభదినంకూడా వస్తుంది. కాస్త ఓపిక పూనండి. మీ ఆశయానికి, మీ దీక్షకు నేను మిక్కిలి కృతజ్ఞణ్ణి. మాతృదేశ స్వాతంత్ర్యేచ్ఛ మీకీ ఉద్రేకాన్ని కలిగిస్తోందని నాకు తెలుసు. మీ త్యాగాన్ని అవసరం వచ్చినప్పుడు ఉపయోగించుకుంటాము. మీ స్త్రీల దళానికి నా ధన్యవాదాలు చెప్పి సమయంకోసం వేచి ఉండండి." అని చెప్పాడు. సరళ ఎంతో ప్రాధేయపడింది—వాదించింది—తమ దీక్షను వెల్లడించింది. ఆమె నభినందించి నేతాజీ పంపివేశాడు. ఇంతైనా స్త్రీలదళంలో కలవరపాటు తగ్గలేదు.

జపాను వారితో కలిసి ఆజాద్ హింద్ సైన్యం భారత సేన 15-వ దళంతో హోరాహోరి యుద్ధం చేసింది. (15-11-43) భారతప్రభుత్వపు దళం ఆ. హిం. సైన్యానికి దొరికిపోయింది. దానితో బ్రిటిషుప్రభుత్వం ఆజాద్ హింద్ సైన్యంయొక్క ప్రతిఘటనాశక్తిని తెలుసుకొని నివ్వెరపడారు. దిక్కు తోచలేదు. ఆకాశకుసుమంగా తోచింది గెలుపు. అయినా ప్రతిఘటింపక తప్పదు. ప్రతిఘటిస్తూనే వున్నారు.

సుభాష్ బాబు రేడియో ద్వారా భారత దేశాన్ని ప్రబోధించాడు. ఆ. హిం. ప్రభుత్వ లక్ష్యాల్ని విశదీకరించి, భారతజాతి ఈ మహాకార్య నిర్వహణకు అన్ని విధాలా తోడ్పడాలని ప్రార్థించినాడు. బ్రిటిషు ప్రభుత్వం ఎంత కట్టుదిట్టాలు చేసినా ఆ హిం. ప్రభుత్వ విజయాలు భారత జాతికి తెలియకుండా చేయాలని ప్రయత్నించినా రేడియోల ద్వారా అన్ని సమాచారాలూ తెలుస్తూనే ఉండేవి. బ్రిటిషు వారు భారతసైనికుల్లో బోసునూ, ఆయనఅనుచరులనూ దేశద్రోహులనుగా ప్రచారం చేశారు. ఈప్రచారాన్ని బహిరంగంగా దేశంలో కమ్యూనిస్టులు బలపరుస్తూ వచ్చారు. ఎంతజరిగినా నేతాజీనీతి పట్టు సడలలేదు. బ్రిటిషున్యాతి రేక దేశాలన్నిటితోటీ సంప్రదించి ఆయా దేశాలసహాయ సంపత్తులు తనస్వతంత్ర ప్రభుత్వానికి లభ్యమయ్యేట్లు చేసుకున్నాడు.

భారతదేశాక్రమణను అస్సాం బెంగాలులగుండా సాగిద్దామని బోస్ నిర్ణయించుకొని అరకాన్, కోహిమాల వద్దా (12-3-44), ఇంఫాల్ వద్దా (18-3-44) ప్రతిఘటనం మొదలుపెట్టాడు. అమెరికా నెదురోడ్డి పోరాటంలో జపాన్ దేశం మునిగి తేలుతున్నది. బ్రిటిషువారు తమ శాయశక్తులన్నీ ఇంఫాల్, అరకాన్ ప్రాంతాల్లోనే కేంద్రీకరించి తీవ్రంగా ఆ. హిం. సైన్యాలతో ప్రతిఘటింప సాగారు. ఆ. హిం. సైన్యంబలం రోజురోజుకూ క్షీణించటం మొదలైంది. అయినా బోసుకు ధైర్యం సన్నగిల్లలేదు.

స్త్రీలదళంలో కలవరపాటు మరీ హెచ్చిపోయింది. ఉద్రేకాన్ని ఆపుకోలేక పోయారు. తమ చేతులలోట పోయే

ట్లుగా యుద్ధంచేసి మాతృదేశస్వాతంత్ర్యంకోసం తమ జీవి తాల్ని బలిదానంగా ఇచ్చేందుకు నిశ్చయించుకున్నారు. నేతాజీదగ్గరకువెళ్లి తమ అభిప్రాయాన్ని తెలిపేందుకు సరళను ప్రార్థించగానే ఆమె అందుకు ఒప్పుకున్నది. రుధి రాక్షరాలతో విజ్ఞప్తి నందజేస్తామని సరళ చెప్పినదానికి అందరూ ఆమోదించారు. సరళ చటుక్కున బొటనవ్రేలిని కత్తితో చిదిమి, స్రవించే ఆ రక్తంతో విజ్ఞప్తిని వ్రాసింది.

"జైహింద్! ప్రియమైన నేతాజీ! నమస్తే,

మేమింక మా ఉద్రేకాన్ని చంపుకోలేము. ఇదివర కెన్నో విజ్ఞప్తులు చేశాము. ఫలితంలేదు. ఇది తుది విజ్ఞప్తిగా భావించవలసిందని మా ప్రార్థన. మమ్మల్ని యుద్ధరంగంలోకి ప్రవేశించవలసిందిగా ఆజ్ఞాపించి, పురుషులతోపాటు మేముకూడా మాతృఋణాన్ని తీర్చుకొనే అవకాశ మివ్వించ వలసినదిగా కోరుతున్నాము. మా రక్తంతో భారతదేశం దాస్యవిముక్తమైనా కావాలి—లేదా స్వాతంత్ర్యవాంఛ పవిత్రమైనా కావాలి. మా యీనిర్ణయానికి ఆమోదించవల సినదిగా వేడికోలు! జైహింద్!"

అందరూ తమతమ బొటనవ్రేళ్ళను చిదిమి రక్తంతో సంతకంపెట్టి సరళచేతి కా విజ్ఞప్తి నిచ్చి పంపారు.

నేతాజీ విశ్రాంతి పుచ్చుకొనబోయే సమయానికి సరళ వెళ్లి కలిసికొన్నది. రక్తాక్షర లిఖితమైన ఆ విజ్ఞప్తి నందజేస్తూ, మా నిర్ణయానికి తిరుగులేకుండా చూడమని నేతాజీని ప్రార్థించింది. "అమ్మా! సైనికులే ప్రతి ఘటనకు తట్టుకోలేకపోతున్నారు. జయము అనుమాన

గ్రస్తముగా వుంది. ఈ స్థితిలో అబలలు మీ రేం చేయ గలరు!'' అని చిరునవ్వుతో అన్నాడు. "నేతాజీ! మాకీ పాటి అవకాశమైనా ఇవ్వలేరా? మేమిందులకు అర్హులం కామా? ప్రతిఘటన ఎలానయినా వుండనీయండి. విజ యమో, స్వర్గమో మాకిపుడు కావాలి. మా దేశానికి మా రక్తం ధారపోస్తాము. అంతే మాకు కావలసింది. ఆ అవకాశాన్నిచ్చి మమ్ముద్ధరించండి'' అన్నది. నేతాజీ ఎంత దూరం చెప్పినా సరళ వినుకోలేదు. కడకు ఆజ్ఞాపించాడు.

స్త్రీలు అద్భుతంగా యుద్ధరంగంలోకి వెళ్లి వారం రోజులు పోరాటం సాగించారు. స్త్రీల రణశూరత్వానికి శత్రుసైన్యాలు ముక్కుమీద వేలెట్టుకున్నాయి. నేతాజీ ఎంతో సంబరపడ్డాడు.

సరళ కిప్పటికి మనశ్శాంతి లభించింది. దేశద్రోహు లైన భారతసైనికుల్ని కొందర్ని యమలోకానికి పంపటమే అందుకు కారణం! స్త్రీలలోకెల్ల చురుకుతనంతో యుద్ధం సాగించేది సరళ. ఆమెసమరనైపుణ్యాన్ని ఎదుర్కోలేక సైనికులు చిందరవందరయ్యేవారు. ఒకనాడు యుద్ధరం గంలో శక్తిస్వరూపిణిలాగా విజృంభించి ఎదుటి సైన్యంపై తుపాకిగుండ్ల వర్షం కురిపిస్తున్నది. వారుసైతం తీవ్రంగానే పోరాడుతున్నారు. సరళతో దెబ్బతిన్న సైనికు డొకడు సమయం చూచుకొని గురిగా కాల్పు కాల్చాడు. తకీమని సరళకాలికి గుండు దూరసుకొని పోయింది.

ఆస్పత్రిలో చికిత్స చేయించుకొంటోంది సరళ. నేతాజీ వచ్చి పరామర్శించి, ఆమెసామర్థ్యా న్నెంతో

కొనియాడిపోయాడు. సరళ లేవలేకుండా మంచంలో వున్నప్పటికీ యుద్ధరంగాన్ని గూర్చే ఆదుర్దాగా వుండేది.

సరఫరాలు ఆ. హిం. సైన్యానికి తగ్గిపోతూ వచ్చాయి. వాతావరణం బాగా లేకపోవటంచేతను, వార్తా సౌకర్యాలు సరిగ్గా వుండకపోవటంచేతను సంఘటన బలవత్తరంగా లేకపోయింది. దినదినానికీ అపజయసూచనలు హెచ్చసాగాయి. భారతసేన పురోగమనం ప్రారంభమైంది. హఠాత్తుగా భారతసేనలు ఆ. హిం. ఆస్పత్రిని చుట్టుముట్టాయి. కొన్ని వందలమంది క్షతగాత్రు లందులో వున్నారు. సరళకూడా అక్కడే వుంది. ఆ. హిం. సైనికులు ఆస్పత్రిని రక్షింపలేక పోయారు. కడకు పారిపోవలసి వచ్చిందికూడా. క్షతగాత్రులందరూ రక్షణలేనివా రయ్యారు. ఆ స్థితిలోనూ సరాసరి ఆస్పత్రిలోనికి ప్రవేశించే ధైర్యం భారతసైనికులకు లేదు. దగ్గరలో జరుగుతూన్న ఈ సందడి నంతా క్షతగాత్రులు గమనిస్తూనే వున్నారు.

సరళహృదయం చెదరలేదు. మృత్యువు నాహ్వానించింది. నేతాజీప్రయత్నాలు ఫలింపకపోయాయనే చింత తప్ప మరేమీ చింతపడలేదు. తన జీవితంలో భారత దేశ స్వాతంత్ర్యాన్ని చూడనోచుకోనందులకు దుఃఖించింది. చేయవలసిందేమి? అనే ప్రశ్న ఆమెను కొన్ని నిమిషాల పాటు వేధించింది. ఉపాయం తోచటంతోనే మనస్సు కుదుటపరచుకొంది సరళ.

భారత సైనికులు జట్లుజట్లుగా మెలకువతో ఆస్పత్రిలోనికి వస్తున్నారు. సరళమాత్రం జాగ్రత్తగానే వున్నది.

ముగ్గురు సైనికులు చాలా దగ్గరగా వచ్చారు. హఠాత్తుగా లేచి కూర్చొన్నది సరళ. పిస్టల్ తీసుకొని, టక్ టక్ టక్ మని సూటిగా ముగ్గురిపై మూడుగుండ్లు కనురెప్ప పాటులో వదిలింది. ఆ సైనికులు నేల కొరిగారు. అన్ని వైపులావున్న సైనికులు చుట్టుముట్టినా సరళ పిస్టల్ క్రింద వేయకుండా కాల్పులు సాగిస్తూ "ఛీ, నీచుల్లారా! మాతృదేశంకోసం పోరాడే మా పైనా మీ ప్రతాపం? మీకు సిగ్గు లేదూ? పొట్టకూటికోసమా స్వాతంత్ర్య వీరుల్ని హత మారుస్తున్నారు? బ్రిటిషు ప్రభుత్వం చేతిలోని కీలుబొమ్మలా మీరు? లక్షలమంది స్వాతంత్ర్యయోధులు మీ కర్కశత్వానికి బలియై పోయారు. ఎంతమంది మనుష్యుల్ని చంపినా స్వాతంత్ర్యవాంఛనుమాత్రం చంపలేరు సుమా! మీకు ఖైదీగా చిక్కుతా ననుకున్నారా? నీచుల్లారా! బ్రతికుండగా మీ చేత చిక్కను." అంటూ గర్జించి కాల్పులు చేసింది. ముందుకు వచ్చేందు కెవరికీ సాహసం లేదు. సరళ వల్ల దెబ్బతిని ఆరుమంది క్రింద పడిపోయారు. ఒకడు గురిపెట్టి సరళగుండెల్లోకి కాల్చాడు. సరళ క్రింద పడి పోయింది. ఆ కిరాతకు లంతటితో తృప్తిపొందారు.

సరళను చంపినా, సరళ ఆదర్శాన్ని చంపే తాహతు ఎవరికుంది? అంత్యకాలంలో ఆమె ప్రదర్శించిన సాహసాన్ని తెలిసికొన్న నేతాజీ "స్వాతంత్ర్యంకోసం బలిదానం చేసింది. మహాత్మురాలు—ధన్యజీవి!" అని సానుభూతి సూచకంగా కన్నీళ్లు విడుస్తూ "జై హింద్!" అన్నాడు.

జై హింద్.

---

PRINTED AT THE LIBERTY PRESS, MADRAS.

ముగ్గురు సైనికులు చాలా దగ్గరగా వచ్చారు. హఠాత్తుగా లేచి కూర్చొన్నది సరళ. పిస్టల్ తీసుకొని, టక్ టక్ టక్ మని సూటిగా ముగ్గురిపై మూడుగుండ్లు కనురెప్ప పాటులో వదిలింది. ఆ సైనికులు నేల కొరిగారు. అన్ని వైపులావున్న సైనికులు చుట్టుముట్టినా సరళ పిస్టల్ క్రింద వేయకుండా కాల్పులు సాగిస్తూ "ఛీ, నీచుల్లారా! మాతృదేశంకోసం పోరాడే మా పైన్నా మీ ప్రతాపం? మీకు సిగ్గు లేదూ? పొట్టకూటికోసమా స్వాతంత్ర్య వీరుల్ని హత మారుస్తున్నారు? బ్రిటిషు ప్రభుత్వం చేతిలోని కీలుబొమ్మలా మీరు? లక్షలమంది స్వాతంత్ర్యయోధులు మీ కర్కశత్వానికి బలియై పోయారు. ఎంతమంది మనుష్యుల్ని చంపినా స్వాతంత్ర్యవాంఛనుమాత్రం చంపలేరు సుమా! మీకు ఖైదీగా చిక్కుతా ననుకున్నారా? నీచుల్లారా! బ్రతికుండగా మీ చేత చిక్కను." అంటూ గర్జన చేసింది. ముందుకు వచ్చేందు కెవరికీ సాహసంలేదు. సరళ వల్ల దెబ్బతిని ఆరుమంది క్రింద పడిపోయారు. ఒకడు గురిపెట్టి సరళగుండెల్లోకి కాల్చాడు. సరళ క్రింద పడి పోయింది. ఆ కిరాతకు లంతటితో తృప్తిపొందారు.

సరళను చంపినా, సరళఆదర్శాన్ని చంపే తాహతు ఎవరికుంది? అంత్యకాలంలో ఆమె ప్రదర్శించిన సాహసాన్ని తెలిసికొన్న నేతాజీ "స్వాతంత్ర్యంకోసం బలిదానం చేసింది. మహాత్మురాలు—ధన్యజీవి!" అని సానుభూతి సూచకంగా కన్నీళ్లు విడుస్తూ "జై హింద్!" అన్నాడు.

జై హింద్.

PRINTED AT THE LIBERTY PRESS, MADRAS.

CONGRESS KATHALU : : Price : Re.